JAGATI Rs. 2-00 December 1990

36th Year of Publication




## డిశంబరు - 1990

## సాహితీ సుధ

గురుడు గురుండు వాలు శతకోటి సుపర్వులు వాహినీపతుల్
సురభవనంబు గోట మధుసూదనుడున్ సహదోడు దంతి ది
క్కరపతి గాగ నొప్పు బలఘాతియు దాయల కోడె నాజిలో
శరణము దైవమే పురుషశక్తి నిరర్థక మెన్ని భంగులన్

—భర్తృహరి

నీల మేఘచ్ఛాయ బోలు దేహమువాడు - ధవళాబ్జ పత్ర నేత్రములవాడు
కంబు సన్నిభమైన కంఠంబు గలవాడు - చక్కని పీన వక్షంబు వాడు
తిన్ననై కనుపట్టు దీర్ఘబాహులవాడు - ఘనమైన దుందుభి స్వరమువాడు
పద్మరేఖలు గల్గు పదయుగంబులవాడు - బాగైకయట్టి గుల్ఫములవాడు
కపట మెఱుగనిసత్యవాక్యములవాడు-రమణి, రాముండు శుభలక్షణములవాడు
ఇన్ని గుణముల రూపింప నెసగువాడు - వరుస సౌమిత్రి బంగారు వన్నెవాడు

—మొల్లరామాయణం



'జ గ తి' - 2, కచేరీ రోడ్, మైలాపూర్, పి బి 2922, మద్రాసు - 600 004
ఫోన్ : 76697 - చందా 2 సం॥లకు రు. 45-00 - 5 సం॥లకు రు. 100-00 - జీవిత చందా రు. 300-00. పాట్రన్ - రు. 1000-00. విదేశాలకు 2 సం॥లకు రు.100-00

ముఖచిత్రం : ఇందిరా గాంధీ

# నిమ్మతొనలు

ఇంజక్షన్ తీసుకోవడానికి అయిదేళ్ల అబ్బాయి అల్లరిపెట్టి గింజు కున్నాడు. చలాకీ అయిన నర్స్, 'ఇంజక్షన్ వద్దులే - ఉండు, పిల్లి బొమ్మ వేస్తాను, చూస్తావా ?' అంటూ సుద్ద ముక్కతో, అబ్బాయి తొడమీద పిల్లి బొమ్మ వేసింది.

'చాలా బావుంది - ఎంత చిలిపిగా మొహం పెట్టిందో' అని ఆ అబ్బాయి అనగా, 'అయితే మరి ఈ పిల్లి తోకకి యింజక్షన్ ఇద్దామా ?' అంది నర్స్ సరదాగా.

'ఓ - అలాగే' అన్నాడా అమాయ కుడు.

చల్లగా ఆ బొమ్మ తోకమీద సూది దించేసింది నర్స్.

పకా పకా నవ్వి చప్పట్లు కొట్టి, 'అయిందా నీ పని!' అని ఆ పిల్లిని ఉడికించాడు ఆ అర్భకుడు.

—భట్టిప్రోలు కృష్ణమూరి
భువనేశ్వర్

సావిత్రి, సూర్యం కొత్తగా పెళ్లయిన దంపతులు.

'నాకు వంట చేయడం వచ్చునో రాదో అనుకున్నారు. ఈ నెల్లాళ్లగా నా చేతి వంట తింటున్నారు కదా - ఏమనిపిస్తోంది ?'

'భేషుగ్గా వుంది - నలభీమ పాకం' - అన్నాడు సూర్యం.

'వాళ్లిద్దరూ మొగాళ్లండీ'

'ఇక్కడ కూడ పురుషాధిక్యతే,' - అన్నాడు సూర్యం నవ్వుతూ.

'ఇంతకీ నా వంట మీకు నచ్చు తోందా ?'

'హెల్త్ ఇన్సూరెన్స్ స్కీములో జాయినయ్యానుగా - యిబ్బంది లేదు' - అన్నాడు సూర్యం.

—జి సుబ్రహ్మణ్యశర్మ
అమలాపురం

అప్పారావ్, నీవు నాస్తికుడివి కదా- తిరుపతి వెళ్ళి గుండు గీయించు కొచ్చావేమిటి ?' - అని ప్రశ్నించాడు రామ్మూర్తి.

'బాబిగాడికి జబ్బుచేస్తే మా ఆవిడ మొక్కుకుందిట - తలనీలాలు యిస్తా నని.'

'ఆవిడ మొక్కుకుంటే నీవు గుండు చేయించుకోవడం మెందుకు ?'

'ఆవిణ్ణి అలా చూడటం యిష్టం లేక, "నీ బదులు నేను చేయించు కుంటానులే" అన్నాను. నేవయితే

టోపీ పెట్టుకోవచ్చు - అమె కెలా కుదురుతుంది ?' అన్నాడు అప్పారావ్.

—ఆర్ వెంకటరత్నం
తెనాలి

విజయ రాఘవులు చెప్పాడు : 'నాకు జీవితంపట్ల రోత పుట్టింది. ఆత్మ హత్య చేసుకోవాలని వుంది. ఉరేసుకు చావడమా, నదిలో దూకడమా, రైలు కింద పడటమా, గుప్పెడు నిద్ర మాత్రలు మింగడమా - ఏ పద్ధతి ప్రకారం ఈ చరమాకం పూర్తి చేయాలో బోధ పడకుండా వుంది, రమేష్. ప్రయత్నం విఫలమైతే నలుగురిలోను నగుబాటు.'

రమేష్, విజయ రాఘవులకి సలహా యిచ్చాడు : 'చాలా తేలికైన పద్ధతి చెప్పనా ? మా ఊరి పంపు నీళ్లు తాగు'

—జి రాము
నందిగామ

విశ్వనాధంగారూ, 'మీకెలా కృతజ్ఞత చెప్పాలో తెలియటం లేదు' - అన్నాడు కొత్తగా ప్రాక్టీసు పెట్టిన డాక్టరు.

'నాకా ? దేనికి ? నేను ఏం చేశానని ?'

'మీ అమ్మాయికి సంగీతం చెప్పిస్తున్నారు కదా ?' - అన్నాడు డాక్టరు.

'అవును'

'ఆ సంగీత సాధన వినలేక మతి పోగొట్టుకు మా క్లినిక్‌కి వస్తున్న పేషంట్ల సంఖ్య అనాటికానాడు పెరుగుతోంది.'

— ఆరెస్ నాగేశ్వరరావు
మాచర్ల

ఆఫీసరుగారు అటెండర్ని అడిగారు :

'గోవిందూ, లెటర్స్ పోస్ట్ చేశావా?

'చేశానండి'

'ఎప్పుడు చేశావు ?'

'రేపు'

'పొద్దుటే వేసి వచ్చావా ?'

'నేను తాగుడు మానేశాను. సార్, నిన్న మీరిచ్చిన లెటర్స్ రేపు పోస్టు చేశాను.'

—కె రామకృష్ణ
రేపల్లె

# పాఠకుల తీర్పు

సాహితీ బంధువు, సహృదయ శిరోమణి శ్రీ ఎన్. ఆర్. చందూర్ గారికి అభివందనాలు. ప్రమోద ఉగాదినాటి 'విజయభావన' కలర్ ఫొటోలు పన్నెండు, అల్బం కోసం పంపుతున్నాను - స్వీకరించగలరు.... విషయ వైవిధ్యంతో, విజ్ఞాన దాయకంగా, వినోదాత్మకంగా ఉంటున్నది 'జ గ తి'. 'విజయభావన' సభ్యులందరూ చదివి ఆనందిస్తున్నారు.... పత్రికారంగంలో మీరు చేస్తున్న కృషి ప్రశంసనీయం.... అనుభవ పూర్వకంగా కథా కథన శైలిలో మీరు 'డైరీ' లో చెబుతున్న సంఘటనలు, సన్నివేశాలు అన్నీ ఎంతో ఆసక్తికరంగా వుంటున్నాయి.

—ఆచార్య భావన్
విజయనగరం

ఎడిటర్ గారికి : నమస్కారములు. 'జ గ తి' జగత్ప్రసిద్ధి కెక్కాలని, వెన్నెల్లు కురిపించే పున్నమి చంద్రుడవాలని, మల్లెలు వికసించే నందన వనమవ్వాలని ఆశిస్తున్నాము.

—త్రిపుర
శ్రీరామ్ నగర్

మిత్రులు చందూర్ గారికి నమస్కారములు. ఎందరెందరో మహనీయులైన తెలుగు వారి జీవితాల్ని కేసరి గారి 'చిన్ననాటి ముచ్చట్లు' ద్వారా తెలుసుకుంటున్నాము.... భాషా ప్రయుక్త రాష్ట్ర విభజన జరిగినా ఎందరో మహాపురుషులు ఈ మద్రాసులో బ్రతికి బట్ట కట్టి అమృత మథనం చేశారు. కేసరిగారి జీవితం ఒక వెలుగుబాట.

—పిలకా లక్ష్మీ నరసింహమూర్తి
మద్రాసు-93

ఆర్యా : ధారావాహికంగా ప్రచురిస్తున్న కేసరిగారి జీవితగాథలోని ఎన్నో విషయములు మాకు బాలా ఆనందాన్ని కలుగచేస్తున్నవి. పాండీ బజారుకి, తేనాంపేటకు మధ్య కేసరి గారి పేరన హైస్కూలు వుంది. ఆ బోర్డు ఇంగ్లీషులోనే ఉన్నది. తెలుగులో కూడా వుండిన బావుండును.

—డి సూర్యనారాయణమూర్తి
మద్రాసు-17

గౌరవనీయులు చందూర్ గారికి : నమస్తే .... 'జ గ తి'లో వివిధ విషయాలే తప్ప కథలు, కవితలు వుండటం లేదు. అలాటివి కూడా వుంటే నా వంటి వారికి మరింత సంతోష దాయకం.

—కెసి బాబు
నెల్లూరు-2



# వెన్నెల కెరటాలు

## చెట్ల సొగసు

1911 సంవత్సరంలో భారతదేశ రాజధాని కలకత్తా నుండి ఢిల్లీకి మార్చాలని బ్రిటిష్ ప్రభుత్వం నిర్ణయించింది. విశాలమైన రోడ్లుతో ఢిల్లీ ఇంత అందంగా తయారు కావటానికి కారణం లూధిన్స్ బేకర్ వంటివారు. 1913లో ఏర్పడిన ఇంపీరియల్ ఢిల్లీ కమిటీ కొత్త ఢిల్లీని సుందరనగరంగా చేసే బాధ్యత చేబట్టింది.... ఢిల్లీ డెవలెప్ మెంట్ అథారిటీలోని ఉద్యానవన విభాగం లక్షలాది వృక్షాల్ని నాటారు. 1968లో ఆరంభమైన ఈ పథకం జయప్రదంగా నడుస్తున్నది. నగర ప్రాంతాలకు మంచి వాతావరణాన్ని కల్పించటం, 18000 ఎకరాలు ఉద్యానవనాభివృద్ధికి కేటాయించటం జరిగింది. 17000 ఎకరాలలో 90 లక్షల చెట్లని చిన్నచిన్న చెట్లని (అంతకుముందు ఉన్న వాటితో సహా) కొత్త ఢిల్లీలో నాటటం జరిగింది. నీడనిచ్చే పిల్ కాన్, పీపల్, అర్జున్, ఇమ్లీ మొదలగు చెట్లని రోడ్ల కిరువైపులా నాటారు.

—మీనాక్షీ మాధుర్
'సైనిక సమాచార్'లో

## శ్రీకాకుళం

ఫ్రెంచిసేనల ఖర్చులకని శ్రీకాకుళం సర్కారు నుండి కొండపల్లి సర్కారు వరకు గల నాలుగు సర్కారులను 1753లో సలాబత్ జంగ్ నుండి ఫ్రెంచివారు రాయించుకున్నారు. చారిత్రిక ప్రసిద్ధి గాంచిన బొబ్బిలి యుద్ధం 1757 జనవరి 24న జరిగింది. 1758లో ఫ్రెంచి వారికి బ్రిటిష్ వారికి చిందుర్తి దగ్గర జరిగిన యుద్ధంలో ఫ్రెంచి వారు పరాజితులయ్యారు. సలాబత్ జంగ్ ఫ్రెంచి వారి పరం చేసిన సర్కారులను బ్రిటిష్‌వారికి కట్టబెట్టాడు. అప్పటి నుండి ఈ జిల్లా బ్రిటిష్‌వారి అధీనంలోనే వుండిపోయింది. భారతదేశ స్వాతంత్ర్యానంతరం 1950లో పరిపాలనా సౌలభ్యం దృష్ట్యా విశాఖ జిల్లాను రెండుగా విభజించి ఉత్తర భాగాన్ని శ్రీకాకుళం జిల్లాగా రూపొందించారు.

—డి జయలక్ష్మి
'తెలుగు విద్యార్థి'లో

లాటరీలు, గుర్రప్పందాలు ఎన్ని తమాషాలు ప్రకటించినా, రెండూ రెండూ ఎప్పుడూ నాలుగే అవుతుంది.

—జాన్సన్

# పాతికేళ్ల నాటి పిక్చర్

## శంభుఫిలిమ్స్ వారి 'ఆంధ్ర మహావిష్ణు'

ఆడపిల్లల పేర్లు పొట్టిగాను, సినిమాల పేర్లు పొడవుగాను వుండటం పరిపాటి అయింది. అలనాటి 'గుణ సుందరి కథ' నుంచి, తాము తీస్తున్న చిత్రానికి 'కథ' అనేమాట చివర తగిలించడం, విజయ కారకమవుతుందనే నమ్మకం నిర్మాతలలో ఏర్పడ్డట్టు తోస్తుంది. ఈ 'శ్రీకాకుళ ఆంధ్రమహా విష్ణు కథ' రెండు వేల సంవత్సరాల క్రితం నాటిదని మనకి చెబుతారు. ఆనాటి ఆంధ్రులూ, నేటి తెలుగు వారూ అక్షరాలా ఒకరేనా అనే వివాదం అటుంచి, ఈపిక్చర్ చూస్తున్నప్పుడు మనకు, వెనకటి చారిత్రక వాతావరణం ఏమాత్రం కనిపించదు. నేటి రాజకీయ నాయకులవలె తగవులాడుకుంటున్న సామంతులని, శ్రీకాకుళ ప్రభువైన సుచంద్రుడు, ఏకతాటి మీద నడిపించ గలుగుతాడు - తన రాజ్యాన్ని దైవదత్తం చేయడం ద్వారా! రాజకీయంగా ఎత్తుగడ గొప్పదేగాని దేవాలయంలో విజయలక్ష్మి ప్లేబాక్ పాటతో అయేపని కాదది - రాజనీతి, కార్యచతురత కావాలి.... ఈ సుచంద్రుని కుమారుడైన వల్లభదేవుడే (యన్టి రామారావు) మన కథానాయకుడు. ఇక, కథా సంవిధాన మంటారా, వీర, శృంగార, హాస్యరసాల మేళవింపుతో కూడిన ఫార్ములా యితివృత్తం. 'సామ్సన్ అండ్ డిలైలా' లోని సామ్సన్‌ని మనం మర్చిపోకుండా యినుపగొలుసులు తెంపే నిశంభుడు (యస్వి రంగారావు), సిరిసిరి అంటూ సిగ్గు దొంతరలు వొలకబోసే నిశంభు రాకుమారి విజయేశ్వరి (జమున), వీరిపాలిట శనిగ్రహమైన దుష్టమంత్రి (లింగమూర్తి) - వీరు ఒకవైపున; వల్లభదేవుడు, అతని బంధువర్గం మరొక వైపున; విజయేశ్వరి చెలికత్తె మకరిక (గిరిజ), అభినవ విభీషణుడు రేలంగి - ఈ రెండు పక్షాలకీ మధ్య నిలబడి, కథ నడిపించగా, విజయలక్ష్మి తన నృతగాన కౌశలంతో మనని మెప్పిస్తుంది. రాచకన్నెలు ఆ రోజులలో అలా వీధులమ్మట గంతులు వేసేవారా అనే సందేహం మనకి రాకమానదు. తెలిసినబాట వెంటనడిచే పరిచితమైన ముఖాలు - మూడు గంటల సంగీత సాహిత్యరసడోలిక, నిర్మాత : డియల్ చౌదరి.

—యన్నార్ చందూర్ సమీక్ష
'జగతి' - జూన్ 1966

---

అతనికి మీరు బీరు పోశారా, కిలుము పడతాడు - రాగిమనిషి అవడం వల్ల; విస్కీ పోశారా, తళతళ్ళాడుతాడు.

—మార్క్‌ట్వేన్

## మానవ ప్రగతి

### కొంకణ్ రైల్వే

పశ్చిమ రాష్ట్రాల ప్రజలు ఎంతో కాలంగా ఎదురు చూస్తున్న పశ్చిమతీర రైలుమార్గం కొంకణ్ రైల్వే నిర్మాణం విషయంలో మహారాష్ట్ర కర్ణాటక, గోవా, కేరళ రాష్ట్రాలతో ఒక ఒప్పందానికి రావడం ద్వారా మన రైల్వేశాఖ ప్రయోజనకరమైన కొత్తత్రోవ తొక్కింది. 837 కిలో మీటర్ల నిడివి ఉండే ఈ రైలుమార్గం పారిశ్రామికంగా వెనుకబడిన కొంకణ్ ప్రాంతం అభివృద్ధికి ఎంతో దోహదం చేస్తుంది. రైలు సౌకర్యాలను విస్తరింపాలన్నా, కొత్త మార్గాల నిర్మాణాన్ని చేపట్టాలన్నా ఇంతవరకు బడ్జెట్‌లో మిగులు తేలిన నిధులను కేటాయిస్తూ రావడం రివాజుగా వస్తున్నది. అయితే రైల్వేల నిర్వహణ వ్యయం, ఇతర ఖర్చులు పెరుగుతూ రావడంతో కొత్త లైన్లు నిర్మాణానికి నిధులను కేటాయించడం సాధ్యం కావడంలేదు. 250 కోట్ల రూపాయల ఈక్విటీ పెట్టుబడితో ఈ కార్పొరేషన్ ప్రారంభమవుతుంది. ఈ మొత్తం 51 శాతం భాగాన్ని రైల్వేలు, 49 శాతం భాగాన్ని ఒప్పందంలో భాగస్వాములైన నాలుగు రాష్ట్రాలు సమకూరుస్తాయి. మహారాష్ట్ర 22 శాతం, (155కోట్లు)కర్ణాటక15 శాతం(137 కోట్లు) గోవా కేరళ రాష్ట్రాలు చెరో ఆరుశాతం (పదిహేను కోట్ల చొప్పున) సమకూరుస్తాయి. ఈమొత్తం ప్రాజెక్టుకు పూర్తి కావడానికి అవసరమైన రూ. కోట్ల 1209 మొత్తంలో మిగిలిన భాగాన్ని మార్కెట్ రుణాల ద్వారా సేకరిస్తారు. ఈ లైను పూర్తయినప్పుడు త్రివేంద్రం, బొంబాయి మధ్య సరాసరి బ్రాడ్‌గాజ్ రైల్వే సౌకర్యం ఏర్పడుతుంది. అంతే కాక ఈ రెండు పట్టణాల మధ్య రైలు ప్రయాణానికి పట్టే కాలం కూడా బాగా తగ్గుతుంది. జాతీయ సమైక్యతా భావాన్ని మరింత పటిష్టం చెయ్యడంతో పాటు వెనుకబడిన కొంకణ్ ప్రాంతం ఆర్థికాభివృద్ధికి కూడా ఈ రైలుమార్గం ఎంతో తోడ్పడుతుంది.

### సురక్షిత సిరంజి

'ఇంజెక్షన్' (సూది మందు) వేసినప్పుడు సూదుల ద్వారా అంటు

వ్యాధులు ఒక రోగి నుంచి మరొక రోగికి వ్యాపించకుండా చూసేందుకై, 'డిస్పోజబుల్' (ఒకసారి వాడగానే పారవేసే) సిరంజిలు అందుబాటులో కొచ్చాయి. అయితే ఈ డిస్పోజబుల్ సిరంజిలను సైతం ఎవరూ దుర్విని యోగం చేయకుండా.... అంటే ఒక సారి వాడిన తర్వాత ఈ సిరంజిని మళ్ళీ రెండవసారి వినియోగించకుండా నిరోధించేందుకే, ఇప్పుడు మరింత సురక్షితమైన 'హైపోడెర్మిక్ సిరంజి' అందుబాటులోకి వస్తున్నది. 'సోలో షాట్' అనే పేరు గల ఈ కొత్తరకం సిరంజితో ఒకసారి ఇంజక్షన్ చేస్తే ఇక ఆ తర్వాత రెండవ దఫా విని యోగానికి అది పనికి రాకుండా పోతుంది. రోగి శరీరంలోకి మందును పంపేందుకు ఈ సిరంజిలోని 'ప్లంగర్'ని ఒకసారి క్రిందికి నొక్కితే ఆ తర్వాత అది బిగుసుకు పోయి ఇక మాత్రం పైకి రాదు. అమెరికాలోని న్యూజెర్సీకి చెందిన బెక్టన్ - డికిన్సన్ కంపెనీ తయారుచేస్తున్న ఈ సురక్షిత సిరంజి అతిత్వరలో అభివృద్ధి చెందు తున్న దేశాలలో అందుబాటులోకి వస్తుంది.

## మిసిసిపి మసాలా

బొంబాయి వీధుల్లో బ్రతికే బాలల అనుభవాలపై రూపొందించిన 'సలాం బోంబే' చిత్రంతో అటు అంతర్జాతీయ స్థాయి గుర్తింపును, ఇటు గణనీయమైన బాక్సాఫీస్ విజయాన్ని సాధించిన భారతీయ 'చలన చిత్రకారిణి' మీరా నాయర్ తన తదుపరి చిత్రానికి ఒక దక్షిణ అమెరికన్ రాష్ట్రంలో జరిగే జాత్యంతర ప్రేమగాథను నేపథ్యంగా ఎంచుకున్నారు. మిసిసిపి, ఉగాండా లలో కూడా చిత్రీకరణకు నిర్దేశించిన ఈ 'మిసిసిపి మసాలా' అనే చిత్రంలో 1989వ సంవత్సరపు ఆస్కార్ అవార్డు గ్రహీత డెంజిల్ వాషింగ్టన్ ప్రధానపాత్ర పోషిస్తున్నారు, 'గ్లోరీ' చిత్రంలో నటించడంతో ఆయన ప్రతిభ మరింతగా వెలుగులోకి వచ్చింది. అమెరికన్ అంతర్యుద్ధకాలం లో పూర్వపు బానిసలు కొందరిని.... అమెరికా సైనిక చరిత్రలోని తొలి నల్ల జాతి రెజిమెంట్‌గా మార్చిన ఒక ఉత్తర ప్రాంతపు తెల్లజాతి అధికారిని గురించి 'గ్లోరీ' చిత్రం చెబుతుంది. 'మిసిసిపి మసాలా' లో కథానాయిక పాత్రకు నూతన నటి అయిన సరితా చౌదరిని ఎంపిక చేశారు. మిసిసిపికి చెందిన ఒక నల్లజాతి 'కార్పెట్ క్లీనర్'కి, ఆఫ్రికాలో జన్మించిన ఒక 'ఇండియన్' యువతికి నడుమ సాగిన ప్రేమగాథ ప్రధాన ఇతివృత్తం ఈ యువతి కుటుంబం ఇడీ అమీన్ కాలంలో ఉగాండాని వదిలి ఇప్పుడు (కథా కాలంలో) మిసిసిపిలో ఒక 'మోటెల్'ని నడుపు తుంటారు. ఈ చిత్రానికి అవసరమైన కథను మీరా నాయర్, 'సలాం బొంబే' కి పనిచేసిన సూనీ తారాపూర్ వాలా కలసి రూపొందించారు. 'సలాం బొంబే'కి పనిచేసిన సాంకేతిక నిపుణు లలో పలువురు ఇప్పుడు 'మిసిసిపి మసాలా' కి కూడా పనిచేస్తున్నారు.

# కొత్త పుస్తకాలు

'నవస్వరాలు' - తొమ్మిదిమంది కవుల కవితాసంకలనం ప్రచురణ: గౌతమీ నవ్య సాహితి, చర్ల - 507 133. ఖమ్మం జిల్లా.... వెల: రు 15-00.

'వీరిలో ఉపధ్యాయు లున్నారు, ఉద్యోగస్తులున్నారు - భిన్న భిన్న జీవన పథాలలో పయనిస్తున్నవారు.... నేడొక్క సాహిత్యమే మనుషుల్ని సమైక్యం చెయ్యగల హరి చాపం' - అన్నారు 'ముందు మాట'గా సోమ సుందర్. ఈ సంకలనంలో వేదావన, చింతలపూడి, చక్రవర్తుల, మాల్యశ్రీ, కిషోర్, లలితా ప్రసాద్, దుర్గాచారి, భూపతిరాజు, అల్లం రాజుల కవితలు వున్నాయి.

'ప్రశ్నించకు నా దేశాన్ని ఏమి చేసిందని, ప్రశ్నించుకో ఈ దేశానికేమి చేశానని' అని దుర్గాచారి (వృత్తిరీత్యా కండక్టర్) నవయువతకు మేలుకొలుపు చెప్పడంలో, కెన్నడీ పలుకులు ధ్వనించినప్పటికీ, అవి సత్యసూక్తుల వంటివి. 'మంచు వలల్లో వుండే కలుగులు - మోహన రాగంలో వుండే విషాదగీతలు - నా చెవులకే విని పించును' - అంటారు వేదావన, వేకువ సాధకునిగా.

'ద్రవ్యోల్బణం దోమతెరలో - దేశ నాయకులు నిద్దరోతే - ధరల దోమలు కుట్టిన - దేశప్రజలకు బ్రెయిన్ ఫీవర్' - అంటారు సమాజాన్ని చూపిస్తూ లలితా ప్రసాద్.... 'అంబరంలో తలలు - అగాధంలో కాళ్లు - ఊహాజీవులు - ఉత్తమేధావులు - ఖరీదైన పరువు - పైన తెల్ల చొక్కా - క్రింద - పరా భవాల - చినుగుల బనీను - నీతి అవి నీతుల మధ్య - అఘోరించే జీవితం' - అని చెబుతారు మధ్య తరగతి గురించి మాల్యశ్రీ.... 'పోడు పంటను పిట్టల పోరు నుండి - కాయు రెండంచె మంచెపై కోయపడతి - తాటిపై నిండు కుండల మాట మరచి - మగని బిలువంగ వనమెల్ల మారు పలుకు' - ఎంత చక్కగా కళ్లకి కట్టినట్టు చెప్పారో చింతలపూడి వెంకటేశ్వర్లు.

నవస్వరాలు పలికే ఈ సంకలనం. భావస్ఫూర్తి గల ముఖ చిత్రంతో, అందమైన ముద్రణతో, కవితా సుమాలు పంచి పెడుతుంది,

—సుమతీ సాగర్

❖ ❖ ❖

స్త్రీ సేవా మందిర్ - 40వ వార్షిక సంచిక. స్త్రీ సేవా మందిర్ ప్రెస్, సాలిగ్రామమ్, మద్రాసు - 93.

1949 అక్టోబరు 2వ తేదీన, గాంధీ జయంతి నాడు, మైలాపూర్ విల్సన్స్ గార్డెన్ స్కూలులో నాగ లింగం పెట్టునీడని ఉద్భవించిన ఈ సంస్థ, స్త్రీ జన సంక్షేమానికి, వనితా వికాసానికి, నారీ లోకపు అభ్యుదయానికి, గాంధేయ మార్గాన 'Where the mind is led forward by Thee - into ever widening thought and action' అనే రవీంద్రుని పలుకులు దిక్సూచిగా, మార్గదర్శకంగా, ఆశయ లక్ష్యంగా నలభై ఫలవంతమగు సంవత్సారాలు గడిపి, అసంఖ్యాక జీవితాలలోకి వెలుగు తెచ్చింది. వృక్షచ్ఛాయని వేసిన ఈ విత్తనం, శాఖోపశాఖలుగా విస్తరిల్లడమే గాక, నాలుగు చోట్ల (అశోక్‌నగర్, విరుగమ్‌బాకమ్, సాలిగ్రామమ్, మెలతూర్) నాలుగు మహావృక్షా లయింది.

అశోక్‌నగర్‌లో జవహర్ విద్యాలయది అగ్రస్థానం - హానిని అంటిపెట్టుకొనే మహోదయ కాంప్లెక్స్. ఉద్యోగినుల పిల్లల్నిచూసే క్రెష్ పేరు 'ప్రమోద'; వైజ్ఞానికాభిరుచిని పెంచేది 'ప్రయోగ'. టైలరింగ్ కోర్స్, కంప్యూటర్ సెంటర్, 'శతపత్ర' పేరుతో షోరూమ్. ఇలా మొత్తం తొమ్మిది విభాగాలున్నాయి అశోక్ నగర్‌లో.

విరుగమ్‌బాకమ్‌లో 'మందాకిని' వుమెన్స్ అకాడమీ; 'ప్రభవ' షోరూమ్; 'వానప్రస్థ, శబరి' అనే పేర్లతో వయసు మళ్లిన స్త్రీలకు ఆశ్రయమిచ్చే గృహాలు - యిక్కడ మరొక తొమ్మిది విభాగాలు వున్నాయి.

సాలిగ్రామమ్‌లో పదిహేడు శాఖలు వున్నాయి. వర్కింగ్ వుమెన్స్ హాస్టల్ (సువ్రత); ఇండస్ట్రియల్ ట్రయినింగ్ (నందిని); చేనేత అద్దకం, కుట్టుపని; మిడిల్ స్కూలు (కావేరి); ప్రింటింగ్ ప్రెస్; హెల్త్ సర్వీసెస్; 'సుధామ' షోరూమ్‌యిత్యాదులు.

చెంగల్పట్ జిల్లా మెలతూర్‌లోని 'సాధన' రూరల్ డెవలప్‌మెంట్ ప్రాజెక్టులో, క్రెష్, ప్రయిమరీ స్కూలు, వయోజన విద్య, వ్యవసాయం, సోషల్ ఫారెస్ట్రీ వంటి ఎనిమిది శాఖలు వున్నాయి.

ఈ మహా సంస్థకు, ఉపాధ్యక్షురాలైన మిసెస్ ఎసి కృష్ణారావు మూల స్తంభం. వేరు వేరు శాఖల నిర్వహణకు సేవా చింతన, కార్యదీక్ష గల వనితలు వున్నారు.... స్వచ్ఛంద సేవా సంస్థలలో గణనీయ మగు ఉదాహరణగా 'స్త్రీ సేవా మందిర్'ని పేర్కొన వచ్చునని రాష్ట్రపతి వెంకట్రామన్ అన్నారు.

ఈ ప్రత్యేక సంచికలో ఆయా శాఖల కార్యక్రమావళి బొమ్మలూ వివరాలూ, నాలుగు భాషలలో (ఇంగ్లీషు, హిందీ, తెలుగు, తమిళం) నారీ ప్రగతికి సంబంధించిన వ్యాసాలూ వున్నాయి. సరోజినీ వరదప్పన్, లలితా పడూల్కర్, మనూ భక్తవత్సలం, భార్గవీ దేవేంద్ర, జయా వేణుగోపాల్, విలాసినీ మీనన్, అద్దంకి సుందరమ్మ, సి ధనలక్ష్మి మున్నగు వారి వ్యాసాలున్నాయి ఈ సావనీర్‌లో.

మద్రాసులోని తెలుగు వారే కాదు, యావదాంధ్ర గర్వింపదగు మహాసంస్థ శ్రీ సేవా మందిర్. స్త్రీలకు ఆశ్రయ మివ్వడంలోను, విద్యావకాశాలు, వృత్తి విద్యాసదుపాయాలు కల్పించడంలోను, తెలుగు, తమిళ, కన్నడ, మళయాళ భాషల ప్రసక్తి లేదు ; ఉత్తర దక్షిణ వ్యత్యాసం లేదు ; కులమత ప్రమేయం లేదు. గాంధీగారి మార్గమే భారత జనానీకపు రాచబాట అని ఆచరణలో చూపిస్తున్నది శ్రీ సేవా మందిర్.

* * *

'త మ స్' - నవల. మూలం, భీష్మ సహానీ, తెలుగు: యార్లగడ్డ లక్ష్మీ ప్రసాద్. ప్రచురణ: నవజ్యోతి పబ్లికేషన్స్, విజయవాడ - 2.... వెల: రు 25-00.

సీరియల్‌గా ఎంతో సంచల నం సృష్టించిన ఈ నవల, ఆంధ్రవార పత్రిక'లో ధారావాహికంగా వెలు వడింది. కులం పేరుతో, మతం పేరుతో రాజకీయాలను కలుషితం చేసినవారు, స్వార్ధ ప్రయోజనమే తప్ప సద్భావన సదభిప్రాయం లేని వారు, సామాన్య ప్రజల జీవితాలతో ఎలా బంతులాడేదీ, సాహిత్య అకాడమీ అవార్డ్ పొందిన ఈ నవల ఎంతో హృద్యంగా దయనీయంగా చెబుతుంది.

పెళ పెళలాడుతున్న అయిదురూపా యిల కొత్త నోటు కోసం, సత్తూ ఒక చీకటిపాకలో పందిని ఎదుర్కోవటం, ప్రాణ భయంతో యిరువురి పోరాటం, చేతిలో కత్తి వున్న మనిషి దిగ్బంధం గావింపబడ్డ ప్రాణిని చంపడం - ఈ

ఎత్తుగడలోనే మనసు జలదరిస్తుంది. అతి పేదవాడు అయిదురూపాయిల కోసం ఎందుకు ఆశపడ్డాడూ అంటే, తనని కనిపెట్టి పనులిప్పించే మురాద్ అలీ ఆజ్ఞకి ఎదురు చెబితే పుట్టగతు లుండవని! చంపిన పందిని సత్తూ చెత్తబండి వాని దారిలో పడేయటంతో అతని పని అయిపోతుంది. తెల్లారేసరికి ఆ చచ్చిన పంది చెత్తబండీ ద్వారా మసీదు వాకిట ఉంటుంది. పందిని చంపి మసీదు దగ్గిర, గోవుని చంపి గుడి దగ్గిర పడెయ్యటమే మత కలహా లకు ప్రథమాంకం. ఈ మతోన్మాదా లలో బలి అయ్యేది నిరుపేదలు, అన్నెం పున్నెం తెలియని అమాయకులూను. పెద్ద వాళ్ల వివేక చింతనకు. చిన్నవాళ్ల ఆవేశాలు అఘాయిత్యాలు అడ్డొస్తాయి.

కమీషనర్ రిచర్డ్, తన భార్య లిజాతో అంటాడు: "మతం పేరుతో వాళ్లలో వాళ్లు కొట్టుకుంటారు. దేశం పేరుతో మన మీదకొస్తారు.

కాంగ్రెస్ హిందువులదనే అభి ప్రాయం - సకారణంగానో, అకారణం గానో - ఏర్పడ్డాక, ఉపఖండ విభజ నకు దారితీసిన ముస్లిమ్ లీగ్ బలం పుంజుకుంటుంది. ఈ రెండూ యిలా వుండగా ఎటువంటి మతావేశానికీ చోటీయని కమ్యూనిస్ట్ పార్టీ యువతను క్రాంతి పథానికి తిప్పుతుంది. మతం కేవలం ముసుగేగాని దోపిడీ విధానం లో అందరూ ఒకటేనంటుంది. వీరు గాక టెర్రరిజమ్ వైపు మొగ్గే మరొక దండు. ఈ విభిన్నవర్గాల మధ్య సద్గురువుని నమ్ముకున్న సిక్కులు.

అమెరికన్ ఫాదరీ హెర్బర్ట్, కమీషనర్ రిచర్డ్‌ని అడుగుతాడు: "నగర రక్షణ ఆ నగరంలో నివసించే పురజనులందరి బాధ్యత - ఇందులో పార్టీలకు, రాజకీయాలకు ఆస్కారమేమున్నది? పరస్పర కలహాల వల్ల నష్టపోయేది తామే కదా?"

ఆ విషయం ప్రజలకు బోధపరచ లేని అసహాయ స్థితిలో ఉంటాడు రిచర్డ్. 'విక్టోరియా రాణి వాగ్దానం' సాకుతో, పాలనా యంత్రాగం నిరసించి, ప్రజలని మతం పేరుతో గొంతులు కోసుకోనిచ్చే స్థితికి వచ్చింది.

కోడిని చంపి దీక్ష పూనిన తర్వాత రణవీర్‌కి తన హింసా ప్రవృత్తి న్యాయ సమ్మతమనిపిస్తుంది.. అత్తరు సాయిబు పొట్టలో పొడిచిన ఇంద్ర్, తనో ఘనకార్యం చేశానను కుంటాడు.... హర్‌రాంసింగ్ దంపతు లని ఒక ముస్లిమ్ కుటుంబం అటక మీద దాస్తుంది. దేవాసింగ్ భార్య పాలు తాగే పిల్లని గుండెలకదుకు, మిగతా స్త్రీలతో బాటు నూతిలోకి దూకి ప్రాణత్యాగం చేస్తుంది.... ఇలాటి దారుణాలనేకం అయాక పునరావాస కార్యక్రమంలో అంకెలు గంతులేయడం ప్రారంభిస్తాయి.

మనసుని ద్రవింపజేసే అనేకానేక సంఘటనలతో వున్న ఈ నవల, ప్రతి భారతీయుడూ ఎంతో శ్రద్ధగా చదివి గుణపాఠం నేర్చుకోవలసిన అవసరం ఈ నాడెంతయినా వుంది.

—క్షీరసాగరమ్



# నా చిన్ననాటి ముచ్చట్లు

## కెయన్ కేసరి



'గృహలక్ష్మి' పత్రిక, 'గృహలక్ష్మి' స్వర్ణకంకణం, స్త్రీల పాలిట వర ప్రసాదమైన లోధ్ర, కేసరీకుటీరం, కేసరీ స్కూల్సు, సంఘసేవ, స్త్రీ జనోద్ధరణ, బాపూజీ ప్రభావం, సంగీత సాహిత్యాభిరుచి - యిలాటివెన్నిటి గురించో చెబుతున్నారు కేసరిగారు తమ 'చిన్ననాటి ముచ్చట్లు'లో. వీటి ద్వారా ఒక మహనీయుని జీవిత చిత్రం మన కళ్లముందు సాక్షాత్కరిస్తుంది. పూల చెట్లతో కలకల్లాడే బెంగుళూరు భవంతి విక్రయించిన మనస్తాప నివారణకు, పూల మనసుల బాల బాలికల కోసం ఒక విద్యాలయం ప్రారంభించిన సున్నిత మనస్కు లాయన. సిరిసంపదలు ఆ మెత్తదనాన్ని మరింత పెంచాయి.

ఉత్తరాది వారట్లుగాక పద్యమెత్తుకొనుటలోనే తారకములో నెత్తుకొని, కొంపలుమునిగి పోవుచున్నట్లు వడివడిగా పద్యమంతయు అక్షరములు కొన్ని కొన్ని మ్రింగుచు వల్లించి, తుట్టతుదకు గిరికీలు త్రిప్పుచు 'తెర న న న' అన్నట్లుగా రాగము విసిరేవారు. దీనివల్ల వారికి అభినయమున కవకాశము కలిగేది కాదు; విసరు రాగములలో రాగసాంకర్యము లేకుండా పాడగలిగిన వారు కడు కొద్దిమంది ఉండేవారు. పద్యార్థము ప్రేక్షకులకు బోధపడుట కష్టము. అయితే రానురాను, గోవిందరాజుల సుబ్బారావు, స్థానం నర్శింహారావు ప్రభృతులు ఆ ధోరణిని బాలావరకు మార్చినారు.

## యడవల్లి సూర్యనారాయణరావుగారు

వీరు వస్తుతః స్ఫురద్రూపూలు; ఒడ్డు పొడుగుగల ఉన్నతమైన మూర్తి గలవారు. సంస్కృత శ్లోకములనుగాని, పద్యములనుగాని, సుష్ఠుగా చదవ నేర్చినవారు. చక్కని సంగీతము, మంచి అభినయము; వీరు మైలవరం కంపెనీలో తొలుత సత్యవంతుని పాత్ర ధరించుచుండిరి. అందే వీరికి పేరు ప్రఖ్యాతులు కలిగినవి. పిదప శ్రీకృష్ణ తులాభారమున కృష్ణుడుగాను, పాండవ విజయమున దుర్యోధనుడుగాను రాణించిరి. వీరు కందుకూరి వీరేశలింగం గారిచే తర్జుమా అయిన శాకుంతలమున దుష్యంతపాత్ర ధరించిరి. నెల్లూరి దొరసామిని దుష్యంతునిగా చూడనివారు వీరిని గొప్పగా మెచ్చుకొందురు. వీరీ పాత్రధారిగా కాళిదాసు రచించిన సంస్కృత శ్లోకములను జోడించి తెలుగు పద్యములను చదివేవారు. అది నాటకమునకు లాయఖు కాక పోయినను, కాళి దాసు శ్లోకముల విని ఆనందించు వారికది పురాణ కాలక్షేపమను మాట తోచేది కాదు. పిదప వీరు సినిమా రంగమున కూడ నటించినారు. వెండి తెరపైన వీరును, బళ్లారి రాఘవా చార్యులు గారును చెరి యొక ఫిలుము నందు దుర్యో ధన పాత్రల ధరించి నటించిరి. పామరులు యడవల్లి వారినే విశేషముగా మెచ్చిరి. ముట్నూరి కష్ణారావు పంతులుగారు మున్నగు రసజ్ఞులు రాఘవా చారి గారి అభినయమునే మేలని సవిమర్శకముగా పొగడిరి. శ్రీ సూర్యనారాయణ గారు హఠాన్మరణము చెందుటచే నాట్యకళకు గొప్పలోటైనది.

## స్థానం నరసింహారావుగారు

స్థానం నరసింహారావుగారిని ఆంధ్రదేశమున ఎరుగని వారుండరు. సుమారు 25 సం॥లుగా వారు ఆంధ్రనాటక రంగమున కీర్తిగాంచి యున్నారు. వారు చిత్రాంగి, సత్యభామ, దేవదేవి, మధురవాణి, చింతామణి మున్నగు

వేషములు వేయగా నేను చూచియున్నాను. ఈ వేషము లన్నిటియందును వారు చాలా విశేషముగ నటించగలిగినవారు. ముసలి మగని వగలాడి పెండ్లము చేయు టక్కులన్నియు చిత్రాంగిగా వారు బహు నేర్పుతో నటింతురు. సవతిపోరు సహించని అభిమానవతియగుభార్యగా ఈర్ష్య అంతయు రూపెత్తినట్లు సత్యభామ వేషమున వ్యవహరింతురు. 'కుత్తుక ఖండించి' అన్నపద్య భాగమును చదువు నప్పుడు విషాదము, రోషము, ఈర్ష్య అన్నియు ఉట్టిపడు చుండును. దేవ దేవిగా ఏ మాత్రమును భూషణముల ధరింపకయే, విప్రనారాయణుని ఆశ్రమ కుటీరము కడ సపర్యలు చేయుచు చూపు కపట భక్తిభావము, క్రమముగా నిజ భక్తి భావముగా మారిపోవుట ఆయనయే అభినయింపవలయును. నిజముగా విప్రనారాయణ సేవాపరతంత్రయైయున్న దేవదేవి ముగ్ధస్వరూపమున నతనిని మరువ సాధ్యము కాదు. మధురవాణిని పాత్రగా సృష్టించిన గురుజాడ అప్పారావు పంతులుగారు వీరి మధురవాణి పాత్రాభినయమును గాంచి యున్నచో తన పాత్రపోషణమున కీయన మెరుగు పెట్టెనని తలంచు ననుటకు సందేహము లేదు. హెచ్చుసంస్కారము లేకున్నను సహజ సౌజన్యత గల బోగము పడుచు మధురవాణి. ఆ రహస్యము నెరిగి నరసింహారావుగారు నటింతురు. విరగబడి నవ్వునప్పుడు ఆయన చలాకీ మరియెవ్వరికిని రాదు. చింతామణిలో సానిగా ఆయన నటించుటలో విశేషము లేదు; సానిబ్రతుకు యొక్క హైన్యతను వర్ణించుచు తన్ను తాను అసహ్యించు కొనునప్పుడు, అరసిక శిఖామణియైన సుబ్బిశెట్టితో ధనమునకై సరస మాడుచు ఏవగించు కొనునప్పుడు అతని ముఖకళలు గమనార్హములు. పురుషు లెందరో స్త్రీ వేషమువేయగా చూచితిని. స్త్రీలే స్త్రీ పాత్రల ధరింపవలయుననే వాద మును ప్రారంభమైన నాటినుండియు గమనించుచునే యున్నాను. స్త్రీలు స్త్రీ పాత్రల నటించుట ప్రశంసా పాత్రమే. అయితే నరసింహారావుగారివలె స్త్రీ పాత్రల నటించగల స్త్రీలు చాల అరుదుగ నుందురని నా అభిప్రాయము.

## ఇతర నటులు

ఇంకను ఎంతోమందిని ఉత్తరాదినటులను చూచియున్నాను. వారం దరును సామాన్యులు. విప్రనారాయణుడుగా కస్తూరి నరసింహారావుగారు బాగుగా మెప్పుపడసిరి. వైష్ణవభాగవతోత్తముని వేషమునకు తగిన స్థూల దేహము, ఊర్ధ్వపుండ్రములను గాత్రముగా ధరించుటకు వలయు విశాలమగు నుదురు, రొమ్ము, శ్రోత్రియపాత్రకవసరమగు శిరోముండన మొనర్చుకొనుటకు దురభిమానము అడ్డురాని మనస్తత్వము, చక్కని శారీరము, ద్రావిడమునను చక్కని ఉచ్చారణ - ఇవన్నియు ఆ వేషము ధరించి మెప్పించుట కాయనకు

అమరియున్నవి. ఆయనతోపాటు శిష్యుడు శ్రీనివాసుని వేషము వేయు చుండిన, కీ. శే. దెందులూరి సుబ్రహ్మణ్య శాస్త్రియు గొప్పనటుడను చెల్లును. ఆయన పిదప నా పాత్ర ధరించుచున్న వంగర వెంకటసుబ్బయ్యగారును ఆ వేషమున ఒప్పించుచున్నారు. ఈ వెంకటసుబ్బయ్యగారే వేశ్యమాతగా కూడ నటించుచుందురు.

## బళ్లారి రాఘవాచార్యులుగారు

వీరిని నేను ఒక ప్రాంతమువారని యనను. వీరిని ఆంధ్ర నటులనుట కన్నను భారతీయ నటులని యందును. వీరీ వేషమునకు తగి ఈ వేషము నకు తగరని చెప్పతగదు. 50వ వరవడిలోను ఏ వయసు వేషధారణమునకైన అమరగల నేర్పువారిదే. చిత్రనళీయమున నలుడు బాహుకుడునై నటించినారు. 'తప్పెవరిది ?' లో సబ్ రిజస్ట్రారు పాత్ర నిర్వహించినారు. విజయనగర సామ్రాజ్యపతనమున పఠాన్ రుస్తుం పాత్రను, ప్రహ్లాద నాటకమున హిరణ్య కశ్యపపాత్రను, చంద్రగుప్తయందు చాణక్యపాత్రను, రామదాసునందు రామ దాసు పాత్రను ధరించి మెప్పు బడిసినారు. తెలుగు, కన్నడ, హిందీ, ఆంగ్ల నాటకము లన్నిట నొక్కరీతి నటించి ఉత్తమనటుడు అనిపించుకున్నాడు. రవీంద్రనాథ ఠాగూరు అంతవారు 'ఉత్తమ భారతీయ నటుడు' అని ప్రశం సించి నారీయనను, స్త్రీలు స్త్రీ ప్రాతల ధరింపవలయుననే వాదమును ప్రారం భించి స్త్రీలు స్త్రీ ప్రాతల ధరించినగాని తాను రంగమెక్కనని శపథముపట్టి, ప్రయత్నమున తన ఆదర్శమును సాధించి కృత కృత్యుడైనాడు. ఆయన నేడు గతించినను ఒక్క రాఘవాచారిగాక, పెక్కు వేషముల ధరించిన ఆ యా మూర్తులుగా నాకు తలుచుకొన్నప్పుడెల్లను కన్నులకు కట్టినట్లు ఆయన కన్పించుచుండును. ఇంతటితో నీ నాటకముల ప్రసక్తి ముగిసినది.

# 24 సంగీతకుల పోషణ

నేను పుట్టిన వంగోలు తాలూకాలో సంగీత సాహిత్యములు బాగుగా వ్యాప్తి కలిగియుండెడివను విషయం తెలిసినదే. అందుచేత అభ్యాసమువలన గాక నైజముగనే నాకు వానియందభిలాష. అందు ముఖ్యముగా సంగీతమన్న చెవికోసుకొందును. సంగీత పాటకులనుకూడ దరిచేర్చి నా చేతనైన సాయము చేయుచుందును. నాకీ గుణము చిన్ననాటనే అబ్బినది.

# ఒక నియోగి పిల్లవాడు

నేను మద్రాసుకు వచ్చిన ఆదిలో మధూకరమును ఎత్తుకొని బ్రతుకు చుంటిని. అప్పుడు నాకు ఒక నియోగి పిల్లవాడు స్నేహితుడాయెను. వీడు గోలకొండ నివాసి. పేరు గోపాలుడు, పాలచంగావి ధోవతిని కట్టి సన్నగ తిరుమణి తిరుచూర్ణమును ధరించుచుండెను. ఆ పిల్లవాని ముఖవర్చస్సు నన్ను ఆకర్షింపచేసెను. భాగవతాది గ్రంధములను చక్కగ రాగముతో ఆ పిల్లవాడు చదువుచుండెను. అప్పుడప్పుడు కూనరాగములను కూడా తీయుచుండెను. తనకు సంగీతమును నేర్చుకొనవలయుననే కోరికగలదని పలుమారు నాతో చెప్పుచుండెను. ఈ పిల్లవానికి యింకను నూనూగు మీసములు కూడ రాక పోయినను నియోగిలక్షణములు వీనిని బాధించుచుండెను. వీడు భోజనముకు చాల కష్టపడుచుండెను. సత్రాన్నము సరిపడదు. వీని అవస్తను చూచి నాతో కూడ మధూకరమునకు రమ్మని పిలిచితినిగాని ఈ నియోగి పిల్లవాడు సమ్మతించలేదు. నేను పస్తు అయినను పరుండెదనుగాని మధూకరమును మాత్రము యెత్తజాలనని గట్టిగ చెప్పెను. "భవతీ భిక్షాందేహి" అని అన్నము అడుగుటకు నాకు చాల చిన్నతనముగ నున్నదని నాతో దీనముగ పలికెను. అప్పుడు నాకు వానిమీద జాలిగలిగి వానిని మన్నించి నేనే మరికొన్ని యిండ్లకు పోయి ఇరువురకు సరిపోవు అన్నమునుదెచ్చి యిరువురము భుజించుచుంటిమి. వీనికి సంగీతపుపిచ్చి బాగుగాపట్టి నన్ను వేధించుచుండెను. అప్పుడు నేను వీనిని వెంటబెట్టుకొని టంకశాల వీధిలో కాపురముండు పాలగాటు అనంతరామ భాగవతరు వద్దకు పిలుచుకొని పోయి వీని కోరికను భాగవతరుకు తమిళములో చెప్పగలిగితిని. భాగవతరు సంతోషముతో శిష్యుని స్వీకరించిరి. మరుసటి దినము మొదలు శిష్యుడు భాగవతరు వద్దకు శిక్షణకు పోవుటకు ప్రారంభించెను. గాని అన్నమునకు మాత్రము నా వద్దకే వచ్చుచుండెను. శిష్యుడు హైదరాబాదు ఆంధ్రుడు. గురువులవారు పాలగాటు తమిళులు. ఇందువలన గురుశిష్యులకు నోటిమాటలు లేకుండగనే శుశ్రూష ప్రారంభమాయెను. శిష్యుడు అప్పుడప్పుడు పోతన భాగవతమును నాటక శైలిలో చదివి గురువుల వారికి వినిపించుచుండెనుగాని వారికి అది తలనొప్పిగ నుండుట శిష్యుడు గ్రహించి గ్రంధమును కట్టిపెట్టెను. పిమ్మట కాళ్లు పిసికించుకొనుటతోను, గుడ్డలు వుతికించుకొనుటతోను, పొగాకును సన్నగ కత్తిరించి వక్క పొడిలోకలపి అందించగా భక్షించుటతోను, అతని సంగీత విద్యాభ్యాసము ప్రారంభమైనది.

అనంతరామ భాగవతర్ భారీమనిషి. సుమారు ఆరుఅడుగుల పొడ వుండును. అజానుబాహువు. విశాల నేత్రములు బుఱ్ఱమీసములు గలవారు. మంచి మేనిఛాయ ; కండపుష్టి గలవారు. వీరు మొదట సంగీత కచ్చేరీలను

చేయుచు మంచిపేరు గడించిరి. క్రమముగ పాటకచ్చేరులనుమాని హరికథా కాలక్షేపములకు దిగిరి. వీరి హరికథలు జనులకు ఆకర్షణీయముగ నుండెను. హరికథలకు పోవునప్పుడెల్లను మన శిష్యుడు కాఫీ తమలపాకుల పెట్టెను కూడ తీసుకొనిపోవుచుండెను. హరికథా కాలక్షేపము రెండుమూడు గంటల కాలము నిలుచుకొని చేయుటవలన భాగవతరు కాళ్లనొప్పులతో యిల్లుచేరి వెల్లకిలపడుకొని శిష్యుని చేరదీసి కాళ్లమీద గుద్దులదరువు వేయమనేవారు. పిల్ల వాడు పాట నేర్చుకొనుటకు ముందే దరువు నేర్చుకొనెను. ఈ శుశ్రూష సుమారు ఆరుమాసముల వరకు జరిగినది. శిష్యునకు విసుకుపుట్టి ఈ బండ చాకిరిని చేయలేక నాతోకూడ చెప్పకుండ పరారి చిత్తగించెను. ఇది గాన విద్యాభిమానమున నా మొదటి అనుభవము.

## శర్మ సోదరులు

నేను మద్రాసులో స్థిరవాసర మేర్పరచుకొని ఎగ్మూరులో స్వగృహమును నిర్మించుకొనిన పిమ్మట నా స్నేహితులు గుంటూరు పబ్లీకు ప్రాసిక్యూటరు రావు బహదూర్ కామరాజుమన్నారు క్రిష్టరావుగారి వద్దనుండి ఒక సిఫారసుజాబును తీసుకొని ఇద్దరు బాలురు నా వద్దకు వచ్చిరి. వీరి తండ్రి కొండలరావుగారు వీరి కూడ యుండిరి. వీరు నాకు దెచ్చినజాబులో - ఈ పిల్ల వాండ్రు విజయ నగర ప్రాంతమునకు చేరినవారనిన్ని, కొంతకాలము ద్వారం వెంకటస్వామి గారివద్ద గానవిద్యాభ్యాసమును చేసినవారనిన్ని, మిక్కిలి పేదవారనిన్ని మద్రాసులో నా సహాయమును కోరి వచ్చుచున్నవారనిన్ని వ్రాసియుండెను. మద్రాసుకు వచ్చుటకు రైలుబార్జి లేక మా వద్ద వున్న హార్మోనియమును అమ్ముకొని ఇక్కడికి రాగలిగితిమని పిల్లవాండ్ల తండ్రి కొండలరావుగారు చెప్పిరి.

వీరి విద్యాభ్యాసమునకై తల్లిలేని పిల్లలను వెంటబెట్టుకొని తండ్రి కష్టపడుట చూచి నాకు వాళ్ల మీద జాలి కలిగినది. వారు నా యింటికి వచ్చి నప్పుడు సుమారు పగలు 10 గంటల కాలము. వాళ్లను వెంటనే స్నానమున చేయుడని, నాతో కూడ భోజనమును చేయమంటిని. భోజనానంతరము పిల్ల కాయలను పిలిచి పాటను వినగోరితిని. చిన్నపిల్లవాడు (కామేశ్వరశర్మ) వీణ, గాత్రము సాధకమును చేసినవాడు. పెద్దవాడు గోపాలరాయశర్మకు ఫిడియలు సాధకము. వీరిరువురి కచ్చేరియు అరగంట కాలము వింటిని. చిన్నవాని గాత్రము వీణానాదము యేకమైనప్పుడు గాంధర్వగాన మనిన నిదియే మోనని నాకు తోచినది. చిన్నవాని ప్రాయమప్పుడు సుమారు 12 సం॥

ఉండవచ్చును. బాలప్రాయము గనుక వాని కంఠము కిన్నెరస్వరమును బోలియుండెను. రెండవ వాని ఫిడియలు వయసుకు మించిన సాధకముగ కనుబడెను. ఈ బాలుర పాట వినిన పిమ్మట వీర్లకు నాచేతనైన సహాయ మును చేయుటకు నిశ్చయించుకొని నా యింటనే ఉంచుకొంటిని.

మద్రాసులోనున్న గానకళాకోవిదులను కొందరిని వీరికి పరిచయపరచి వారివద్ద సంగీతమును అభ్యసింప చేసితిని. వీరు తమిళగాయకులవద్ద కొంత కాలము విద్యనభ్యసించి బుద్ధిమంతులయిరి. మద్రాసులో యున్న గానసమా జముల వారిని ఆశ్రయించి వారి సభలలో, ఈ పిల్లకాయలకు అవకాశమివ్వ వలయునని పలుమారు వార్లను వేడుకొంటినిగాని ఫలించలేదు. అప్పుడు నేను యితరులను ఆశ్రయించి ప్రయోజనము లేదని తెలుసుకొని పిల్లకాయల గానమాధుర్యమును గురించి వార్తాపత్రికలలోను కరపత్రముల ద్వారాను వెల్లడి చేసితిని. పిల్లవాండ్లకు శర్మసోదరులని (Sarma Bros) పేరు పెట్టి గోక్లేహాలునందు, విక్టోరియా పబ్లీకుహాలునందును గొప్పవారి యాజమాన్య ముతో పాటకచ్చేరీలు యేర్పాటు చేసితిని. ఆ సమయమున మద్రాసు ప్రముఖులలో కొందరు పిల్లవాండ్ల గానమును గురించి ఉపన్యసించిరి. మరు నాడు వీరి కచ్చేరీలను గురించిన ఉపన్యాసములు వార్తాపత్రికలవారు ప్రచురిం చిరి. అప్పటినుండి మద్రాసులో వీరి పాటకు పేరువచ్చి సంగీత సమాజముల వారు వీర్లను ఆదరించుచుండిరి.

మద్రాసులో కొన్ని సంవత్సరముల క్రిందట ఆల్ ఇండియా ఓరియంటల్ కాన్ఫరెన్సు (All India Oriental Conference) సెనెట్ హౌసులో జరిగెను. ఆ సభకు రాజధానిలో యుండు గొప్పగాయక శిఖామణులను ఆహ్వానించి, పాడించి, మంచిపాటకులకు బంగారు పతకములను బహూకరించిరి. ఈ సభలో శర్మసోదరులు పాల్గొని జడ్జీలను మెప్పించి బంగారు పతకములను బడసిరి. ఈ సభ ముగిసిన మరునాడు కాన్ఫరెన్సుకు వచ్చిన హేమాహేమీల నందరిని మా యింటికి విందుకు బిలచి శర్మసోదరుల పాటకచ్చేరిని యేర్పాటు చేసితిని. ఈ కచ్చేరికి అరియకుడి రామానుజయ్యంగారు, వేణుగాన సంజీవ రావుగారు, నాగస్వరం మధుర పొన్నుసామిపిళ్ల, మృదంగం అళగనంబి, దక్షిణామూర్తి, సి. ఆర్. శ్రీనివాసయ్యంగారు, మొదలగు సుమారు రెండు వందలమంది విందుకువచ్చి పిల్లవాండ్ర గానమును విని సంతోషించిరి.

పిమ్మట కొంతకాలమునకు రామేశ్వరము దేవాలయములో మహాకుంభాభి షేకము జరిగెను. ఈ కుంభాభిషేకమునకు గొప్ప సంగీత విద్వాంసులను రావించి సభలను గావించి మొదటిక్లాసు విద్వాంసులకు రు. 500లు బహుమతి

నిచ్చిరి. ఈసభలో కూడ శర్మసోదరులు రు 500లు తాంబూలమును బడసిరి. ఈకుంభాభిషేక మహోత్సవమునకు నాటుకోటిశెట్లు కొన్ని లక్షలు ఖర్చుపెట్టి అతివైభవముగ పది దినములు అభిషేకాదికార్యములను జరిపిరి. ప్రతిదినము సుమారు పదివేలమంది పలువిధములైన పిండివంటలతో భోజనముచేసిరి. మేము రామేశ్వరమునుండి శేతువుకు పోయి స్నానముచేసి మధురకు వచ్చితిమి. మధురలో రెండు సంగీతకచ్చేరీలు చేసి వెయ్యిరూపాయిల ముడుపుతో మద్రాసు చేరితిమి.

పిమ్మట మైసూరు అస్థాన సంగీత విద్వాంసులగు బిడారం క్రిష్ణప్పగారిని శర్మసోదరులకు పరిచయ పరచితిని. క్రిష్ణప్పగారు పిల్లకాయల గానమును విని చాల సంతోషించి, వీర్లను మైసూరు దర్బారులోకి ప్రవేశమును కలుగ చేసిరి. శర్మసోదరుల గానమును మహారాజులవారు (గతించినవారు) విని చాల సంతృప్తులయి గాయకులకు గొప్ప బహుమానముల నొసంగిరి. ఒకటి రెండు కచ్చేరులు దర్బారునందు జరిగిన పిమ్మట ఈపిల్లకాయలను క్రిష్ణప్పగారికి వప్పగించి వీర్లను మీరు చక్కగ తరిఫీదుచేయవలయునని అజ్ఞాపించిరి. వీరు దర్బారు అతిధులుగ యుండుటకు తగుమైన యేర్పాట్లును చేయించిరి.

ఈ సోదరులు కొంతకాలము క్రిష్ణప్పగారివద్ద విద్యనభ్యసించి మద్రాసుకు చేరిరి. ఇప్పుడు వీరివద్ద కొంత మల్లె చేరినది. మా యిల్లు విడిచి వేరే బస నేర్పరుచుకొనిరి. స్వతంత్రులయిరి. నేను మొదట అనుకున్నంత వృద్ధికి మద్రాసులో రాజాలకపోయిరి. పిల్లకాయలిద్దరు వివాహములను చేసుకొని బిడ్డలతో సుఖముగ మద్రాసులో స్థిరవాసరము నేర్పరచుకొని యున్నారు. వీరు క్రమముగ పాటకచ్చేరీలకు స్వస్తిచెప్పి సినీమాలలో వెనుకపాటకులయిరి. నేను అప్పుడప్పుడు వీర్లను చూచుచుందును. చిన్ననాటి విషయములను జ్ఞాపకమునకు తెచ్చుకొని సంతోషించుచుందును.

## హరినాగభూషణముగారు

బ్రహ్మశ్రీ గాయక శిఖామణి హరినాగభూషణము గారు ఆంధ్రదేశమునకు చిరపరిచితులు. వీరు ప్లీడరువృత్తిలో నుండి ఫిడియలును అభ్యసించి ప్రసిద్ధపురుషులయిరి. వీరు అందరికి సులభముగ అందుబాటులో లేకపోయినను దొరికినప్పుడు సభ్యులను ఆనందింపచేయు పండితులు. బ్రహ్మవర్చస్సుగల వైదికశిఖామణి. రామభక్తులు. సంగీతముతోకూడ సాహిత్యమును అభ్యసించిన పుణ్యపురుషులు. ఈ కాలమున ఆంధ్రదేశమునకు వన్నెదెచ్చిన వాగేయకారులు.

వీరు మద్రాసున మాయింటికి వచ్చిరి. మద్రాసులో వీరిని గొప్పగ సన్మానించవలయునని ఒక సన్మాన సంఘము యేర్పాటు చేయుటకు ప్రయత్నించితిని గాని అది జరుగలేదు. కడపట మాయింటిలోనే సభచేయించి రజిత పాత్రము, రు 116లు బహుమతి నిచ్చి నమస్కరించితిని.

## వారణాశి సోదరులు

వారణాశి సుబ్బయ్య, ఘంటయ్య అని వీరు సోదరులు. ఒకరు గాత్రమున ఒకరు మృదంగమున నిధులు. వీరు మద్రాసుకు వచ్చినప్పుడు, వీర్ల సంగీత సభను గోక్లేహాలులో యేర్పాటుచేసి జోడుతోడాలను ఇరువురకు తొడిగితిని. వీరిది బందరు కాపురస్థళము. మరల వీరిని నేను చూచుటకు తటస్థించలేదు.

## యజ్ఞనారాయణ శాస్త్రి

యజ్ఞనారాయణశాస్త్రిగారు అని యొకరు 1942లో కాబోలు నావద్దకు వచ్చిరి. వారు ఫిడేలును ద్వారం వెంకటస్వామిగారివద్ద నేర్చితిమనిరి. వీరిని సంగీత శాస్త్రమున పేర్గాంచిన శ్రీవెంకట్రామయ్యర్‌గారి వద్దకు తీసుకొనివెళ్లి వినిపించితిని. వారు ఆయనకు సంస్కారమును సాధనము కలదని మెచ్చిరి. ఆ పిదప మాయింటనే యొక కచ్చేరీ గావింపించి, అందు ఆయనను బంగారు పతకమును గొలుసుతోచేర్చి కంఠమున అలంకరింపజేసి సత్కరించితిని.

## మద్రాసు గానసభలు

నేను మద్రాసుకువచ్చినపిమ్మట తమిళుల సాంగత్యమువలన నాకున్న క్రమముగ గానకళాభిమానము ఇనుమడించినది. మద్రాసులో జరుగు సంగీత కచ్చేరీలకు నేను తప్పక హాజరగుచుండెడి వాడను. ఆ కాలమున మద్రాసులో నేటివలె సంగీత సమాజము లుండినట్లు నాకు జ్ఞాపకము లేదు. ఎవరి ఇండ్లలోనైననుఅగు వివాహకార్యముల సందర్భములలో జరుగు పాటకచ్చేరీలకు పోవుచుంటిని. అప్పుడు పురుషుల కచ్చేరీల కంటే స్త్రీలకచ్చేరులే విశేషముగ జరుగుచుండెను. బెంగుళూరు నాగరత్నం, కోయంబత్తూరుతాయి, ధనకోటి, గోదావరి, నేలంచెల్లెంద్రు, రాజాయి మొదలగువారి కచ్చేరులు విశేషముగ జరుగుచుండెను. వీణె ధనము గొప్పవిద్వాంసురాలైనను వివాహకార్యములలో వీణెకచ్చేరిని పెట్టించువారు చాలకొద్ది. అయితే ఈమె ప్రతి శుక్రవారమునాడు

తన యింటిలో వీణె కచ్చేరిని జరుపుచుండెడిది. అప్పుడు అభిమానులు ఆమె యింటికి పోయి వీణెపాటను వినేవారు.

వేణుగాన గాయకులలో ప్రథమమున మద్రాసుకువచ్చి అసమాన పాండిత్యమును చూపిన మహానుభావుడు శరభశాస్త్రిగారు. వీరు పుట్టినది మొదలు ఈ పాడులోకమును చూడక జ్ఞానేంద్రియములతోనే వేణుగానమభ్యసించి కీర్తిని బడసిన పుణ్యపురుషుడు, వీరి తర్వాత వేణుగానములో ప్రసిద్ధి చెందినవారు నాగ రాజరావుగారు, పల్లడం సంజీవరావుగారు. సంజీవరావుగారు వృద్ధులైనను ఇప్పుడు యెప్పుడైనను పాడుచుందురు.

ఆ కాలమున శరభశాస్త్రిగారి వేణుగానము, గోవిందస్వామి ఫిడియలు, అళగ నంబి మృదంగము గొప్ప పాటకచ్చేరిగ నుండెను. ఈ ముగ్గురికచ్చేరి ఒకనాడు జార్జిటవున్‌లో యొక శెట్టిగారింట జరుగుతుందని దెలసి, నేనును నాతో కూడ నెల్లూరి కాపురస్తుడు విస్సా రామారావుగారును వెళ్ళితిమి. అప్పుడు విస్సా రామారావుగారు మద్రాసులో లాకాలేజిలో చదువుచుండిరి. వీరు గానప్రియులు. ఈ కచ్చేరికి రావలసిన విద్వాంసులలో శరభశాస్త్రిగారును గోవిందసామి ఇరువురు వచ్చిరిగారిని మృదంగమును వాయించు అళగనంబి యింకను రాకయుండెను. వచ్చిన పాటకులు కొంతవరకు వేచియుండి మృదంగమునకు మరియొకని యేర్పాటుచేసి సభను సాగించిరిగాని శరభశాస్త్రిగారికి మృదంగమంతగ సహించలేదు. అళగనంబిగారు వచ్చు రైలు ఆలస్యముగ వచ్చినందున వారు అరగంట ఆలస్యముగ సభకు వచ్చి శాస్త్రిగారి ప్రక్కన మెల్లగ కూర్చుండి తిన్నగ మద్దెల మీద దెబ్బవేసిరి. ఆ సుశబ్దమును శాస్త్రిగారు విని ఆనందముతో 'అణ్ణావందియా' (అన్నావచ్చావా) అని అళగ నంబిని చేతితో తడిమి సంతోషించెను. అప్పుడు సభ్యులందరు గొల్లున నవ్విరి. ఈ పుట్టంధుడు అళగనంబిని చూడకనే సుశబ్దమును వినిన వెంటనే వారిని గుర్తించగలిగెను. ఈ విషయమును నేను యిప్పటికిని యెవరితోనైనను చెప్పుచుందును.

ఆ కాలమున మద్రాసులోజరుగు వివాహకార్యముల సందర్భములలో జరుగు సంగీత కచ్చేరీలకు స్త్రీలు వచ్చెడివారుగాని, బహిరంగముగ జరుగు గానసభకు స్త్రీలు అంతగ వచ్చెడివారుకారు. కొద్దిమంది సంగీతజ్ఞానముగలవారు వచ్చినను చాటున కూర్చుండి పాటను విని పోవుచుండిరి. ఇప్పటి వలె అప్పుడు స్త్రీలలో గానకళాభ్యాసము వ్యాప్తిచెందియుండలేదు. ఆ కాలమున దాశీలు తప్ప తక్కినవారు గానమభ్యసించుట మర్యాదగ నుండెడిది కాదు. (ఇంకా వుంది




## 1990 సెప్టెంబరు 06

'యువతరం శిరమెత్తితే - నవతరం గళమెత్తితే - లోకమే మారిపోదా - చీకటే మాసిపోదా' అని వినోదకుమార్, మీనా, రేణుకల చిత్రీకరణపై వందే మాతరం శ్రీనివాస్ బృందం పాడిన పాట (కీ॥ శే॥ నార్ల చిరంజీవి) ప్రేక్షకులలో ఆవేశాన్ని ఉత్సాహాన్ని కలిగిస్తుంది; దేశభవిష్యత్తుని బాగుచేయగలిగినది నవయువతే సుమా - అని గుర్తు చేస్తుంది. 'ఎంతకాలం ఇంత ఘోరం' అని సిరివెన్నెల సీతారామ శాస్త్రి రాసిన పాటకూడా (చిత్రీకరణ : రాజేంద్రప్రసాద్, మీనా, వేలు, రాజేశ్వరి, గౌరిలపై - గాత్రం : వందే మాతరం శ్రీనివాస్) మనసుని మెత్తగా తాకుతుంది. ఈ రెండూగాక అదృష్ట దీపక్, గుండవరపు సుబ్బారావు, అప్పలాచారి వ్రాసినవి కూడా వున్నాయి. యమ్ నాగేశ్వరరావు, కె ఆదిత్య దర్శకత్వంలో నిర్మిస్తున్న 'నవయుగం' కి కథారచన - సంభాషణలు : హరనాథరావు, టి కృష్ణ మెమోరియల్ మూవీస్ బేనర్‌లో రూపొందుతున్న ఈ చిత్రం లో రాజేంద్రప్రసాద్, వినోద్ కుమార్, మీనా, వేలు, చలపతిరావు, సంజీవి, సాయి మున్నగువారున్నారు. పాత్రికేయులకు ఈ ఉదయం ఎమ్ ఎమ్ థియేటర్‌లో పాటలు చూపించారు.... పి ఆర్ ఒ : పసుపులేటి రామారావు.

## 1990 సెప్టెంబరు 07

సక్కూబాయి, పాండురంగ దంపతుల కుమార్తె సౌ॥ లలితశ్రీకి, చి॥ జయచందర్‌కి (అనసూయా, వేణు గోపాల్ నాయుడు దంపతుల కుమారుడు) ఈ ఉదయం పది గంటలవేళ, శ్రీ రామా కళ్యాణ మండపంలో శాస్త్రోక్తంగా వివాహం జరిగింది. పాండురంగ, ఆంధ్రజ్యోతి గ్రూప్‌కి, మద్రాసు బ్రాంచి మేనేజరు; చిరకాల మిత్రులు. పత్రికా ప్రపంచంలోనివారు, ఫిలిమ్ ఫీల్డ్ పెద్దలు నూతన వధూవరులపై శుభాక్షితలు చల్లారు. నవదంపతులకు మా మనఃపూర్వక శుభాకాంక్షలు.

## ..... 08

కళాసాగర్ వారు రాజాఅణ్ణామలై మందిరంలో విశాఖపట్నం 'చైతన్యం' (నాటకసమాజం) చేత రెండు నాటిక

లను ప్రదర్శింపజేశారు. రచన : యస్ ఎ. రావు ; దర్శకత్వం : కృష్ణచైతన్య. ....మొదటి నాటిక పేరు : హరిత. 'పదేళ్లయినా పిల్లలు కలగలేదు, ఫ్రెండ్సందరూ నా పురుషత్వాన్ని శంకిస్తున్నారు' - అని మొదటి భార్యకు విడాకులిచ్చి, మరొకమ్మాయిని చేసు కోగా, ఆమె ఒక శిశువుని కని, మరణి స్తుంది. ఆ పసివానిని పెంచేభారం అతనిపై పడుతుంది. ఈ నాటికలో వున్న మెలిక ఎక్కడంటే, పిల్లలు కలగక పోవడానికి లోపం, అతనిలో ఉందిగాని ఆమెలోకాదు. రెండోసారి యితను చేసుకొన్న అమ్మాయి, పెళ్లినాటికే గర్భవతి. తన వంశోద్ధార కుడు అని మురిసిపోయిన ఆ పసివాడు, తనవాడు కాదు, ఎవరి వరప్రసాదమో అని తెలియడంతో, అతని పరిస్థితి దయనీయంగా తయారవుతుంది. క్షమించమని వెనకటి భార్యని బతిమాలుకుంటాడు. తండ్రి, దగ్గిర వారు ఆమెపై వొత్తిడి తెచ్చి, గతం మర్చి పొమ్మంటారు. 'మీ రందరూ పురుషులే గనక పక్షపాత బుద్ధితో చెబుతున్నారు అతనిలోని అక్రమాన్ని, అల్పబుద్ధిని, అమానుషత్వాన్ని అంత చేరువ నుంచి చూసిన నేను, మళ్లీ అతనితో ఎలా కాపరం చేయగలను? నాకు ఎవరి ఆసరా అక్కర్లేదు - నా కాళ్లమీద నేను నిలబడతాను' - అని ముఖం మీద కొట్టినట్లు చెప్పి, వెళ్లిపోతుందామె (హరిత). కథా నాయికగా వేసిన లక్ష్మి, విడాకులకి ముందు, విడాకుల తర్వాత, తన పాత్రలోని పాత్రోచిత వైవిధ్యాన్ని ఎంతో రమ్యంగా పోషించింది. ఇతి వృత్తమూ, నాటకీయత ప్రశంస నీయంగా ఉన్నాయిగాని వాస్తవికత లోపించింది. నాటకీయలక్షణాల కంటె సినిమా ప్రభావం ఎక్కువగా ఉంది. ఆ ప్రభావం తగ్గి, సమకాలీన పరి స్థితులకి అనుగుణంగా పాత్రలు నడుచుకుంటే, యిదే యితివృత్తం యింకా ఎక్కువ రక్తిమతో రాణిస్తుంది .... రెండవ నాటిక 'మనీ విలాసమ్' లో అందరూ స్త్రీలే. కూతురెక్కడో దూరాన వుండగా, కోడళ్లిద్దరూ అత్త గారి డబ్బుకోసం, మొదట కొట్లాడుకు, ఆ పైన ఒకటై, నిర్లజ్జతో దోచుకోవ డం యిందులోని ప్రధానాంశం. డబ్బుకి గడ్డి తింటారనే ప్రాచీన సత్యాన్ని, స్నేహితురాలొకామె, ఆ అత్తగారికి అనుభవ పూర్వకంగా తెలిసేటట్టు చేస్తుంది. పెద్దపెద్ద విషయాలు లేక పోయినప్పటికీ, స్వభావచిత్రణతో ప్రేక్షకులని నవ్వు పువ్వుల్లో ముంచే నాటిక యిది. అందరూ బాగా వేశారు.... 'నలభై ఏళ్ల క్రితం స్త్రీ పాత్రలు లేకుండా నాటకం రాయమనే వారు - ఎందు కంటే స్త్రీ పాత్ర వేసే వారు దొరకటం కష్టంగా వుండేది అప్పట్లో! రెండో నాటికలో అందరూ స్త్రీలే - పురుష పాత్రధారులు దొరకక కాదు - అక్కర్లేదనుకున్నారు .... ఈ ప్రదర్శన చూశాక, వ్రాయడం కూడా ఒక స్త్రీయే వ్రాసి వుంటే ఎంత బావుండేది - అని పించింది' - అన్నారు ఈ ప్రోగ్రామ్‌కి

ముఖ్య అతిథిగా విచ్చేసిన డివి నరసరాజు.

09

యూనివర్సిటీ సెంటినరీ హాలులో మద్రాసు ఫిలిమ్ ఫాన్స్ 39వ వార్షికోత్సవం, లక్ష్మీ విశ్వనాథన్ బృందం వారి, శివుని ఆనంద తాండవంతో ప్రారంభమయింది. సూర్యనారాయణ కరచరణ విన్యాసంలో గాంభీర్యమూ భావగరిమ కనిపించాయి.... పురాణ పాత్రలని నేటి సమాజంలో ప్రవేశ బెట్టి, తర్వాత కొంత హ్యూమర్ సృష్టించి, సందేశ మివ్వడమనేది తమిళ రంగస్థలంపై చాలాకాలంగా ఉంది. వాల్మీకిని, కంబన్‌ని ఒక న్యాయస్థానంలో ప్రవేశపెట్టి, ఒకరిని మించి ఒకరు ఎంత ఉన్నతులు, ఉదారులో చెబుతాడు నాటక రచయిత క్రేజీ మోహన్. ఆతర్వాత చంద్రబోస్ ఆర్కెస్ట్రా - యస్పి, చిత్ర, మనో మున్నగు వారి లలిత సంగీతం.... సభాధ్యక్షులు ; జస్టిస్ గోకులకృష్ణన్ ; ముఖ్య అతిధి ; 'ఐటిసి' బ్రాంచి మేనేజరు యల్చి సింగ్. ఫిలిమ్ పరిశ్రమలో ఈ సంవత్సరపు 'గెస్ట్ అఫ్ అనర్' : డి రామానజమ్.... బెర్కిలి సిగరెట్ల వారు ఈ ఫంక్షన్ స్పాన్సర్ చేశారు.











"Father, you were telling me that the one at Panchavati was a Fake Seeta. Was this a secret hidden from Lakshmana as well ?" queried Raghu.

"Yes. No one knew of this excepting the couple themselves. You should not forget that Seeta was the one who spotted the Golden Deer. Were it Real Seeta would she be enamoured of it?" put in Raghu's Father.

"I do not understand your logic. Women are always after novelties - an inherent trait in them. Do you imply that if she were Real Seeta, she would not have bothered about the elusive animal?"

"Exactly. Of the three at Panchavati, it was Seeta that first was the Golden Deer - neither Rama nor Lakshmana. Rama was a personification of Knowledge and Wisdom while Lakshmana was a personification of Sacrifice and Renunciation. One was endowed with correct perceptions and the other with utter detachment. As such, their eyes never felt upon the Golden Deer - symbolic of gold and wealth. As this Seeta happened to be a fake one, she was after fleeting objects, ignoring the essential values. Most of these things depend upon our attitude, aptitude and outlook," said Raghu's Father.

---

*Swadharma Swaarajya Sangha (Director : BVSS Mani*
*Beehive Bldgs - 29, Prakasam Road, Madras - 600 103.*



ఫాన్స్ అసోసియేషన్‌కి మూల స్థంభంగా కార్యదర్శి ఆర్ సి కన్నయ్య చేస్తున్న అవిరళ కృషి అభినందనీయ మగు నిస్వార్ధ సేవ.

. . . . . . 10

విల్సన్ గార్డెన్ స్కూలువారి వార్షికోత్సవం (యాన్యువల్ వెరైటీ ఎంటర్‌టైన్‌మెంట్) ఏ ఏటి కాఏడు నిత్యనూతనంగా ఉంటుంది. అందుకు కారణం ఒక్కటే; అయిదారేళ్ల పసివాళ్లు - బాల బాలికలు ఏభై అరవై మంది - బెదురు చూపులతో వాలు చూపులతో మందస్మిత వదనాలతో రంగు రంగుల దుస్తులలో నృత్యాభినయం చేస్తూ, మీకు స్వాగతం చెబుతారు. ఆ ఒక్క అయిటమూ చాలు ప్రేక్షక హృదయాన్ని ఆకట్టుకునేందుకు.... కప్పా ఎలక్ట్రికల్స్ మేనేజింగ్ డైరక్టరయిన కమలా పరశురామ్ ముఖ్య అతిధి. 'బెస్ట్ టీచర్' (ఉత్తమ అధ్యాపకురాలు) అవార్డు అందుకున్న శకుంతలా శర్మని, జర్నలిస్ట్ రామానుజమ్ మున్నగువారు అభినందించారు ; గర్ల్ గైడ్స్‌కి మెడల్స్ అందజేశారు.... ప్రదర్శనలలో సరోజినీ నాయుడు 'బాంగిల్ సెల్లర్' (గాజుల బేహారి) ఎంతో రక్తి కట్టింది. రూపకమంతా యింగ్లీషులో అయినప్పటికీ, పాల్గొన్నవారు స్పష్టమగు ఉచ్ఛారణతో తమ పోర్షనులు చెప్పారు. తెలుగు విద్యార్థినులు బుర్రకథ రసవత్తరంగా చెప్పారు. నలుగురు అబ్బాయిల్ని

అమ్మకానికి నిలబెట్టిన 'వరకట్నం' తమిళ ప్రదర్శనలో, అబ్బాయి బేరం ఫైసలవగానే 'సోల్డ్ అవుట్' అనే బోర్డు తగిలించడం, ప్రేక్షకులని నవ్వులలో ముంచింది. మ్యూజిక్ అకాడమీ వేదిక మీద ఒక పక్కగా శర్మా దంపతుల నిలువెత్తు చిత్రపటం, ఎందరెందరికో ఎన్నో జ్ఞాపకాల పరిమళ ప్రసూనం.

## .....11

రసికరంజని సభవారు తమ స్వర్ణోత్సవ సందర్భంగా, మణిగా రమ్మాయి లక్ష్మి, కూచిపూడి నాట్య ప్రదర్శన ఏర్పాటు చేశారు. ఇవ్వాళెంతో శ్రద్ధగా కూచుని చివరిదాకా చూశాను. ఫుట్ వర్క్ (చరణ విన్యాసం), ఎక్స్‌ప్రెషన్ (భావస్ఫూర్తి) బ్రిస్క్‌నెస్ ఆఫ్ మువ్‌మెంట్ (కదలికలోనివేగం) చెప్పుకో దగ్గంత చక్కగా ఉన్నాయి. అయిటమ్స్ కూడా బహుపరిచితమైనవి గాక రెండు మూడు కొత్తవి ఉన్నాయి. ఆ కొత్త అయిటమ్స్ నాట్యకారిణి ప్రతిభకు వన్నెతెచ్చాయి. సుమారు రెండు గంటలసేపు ప్రేక్షకులను రసోల్లాస లహరిలో విహరింపజేసింది వెంపటి చిన సత్యం శిష్యురాలైన లక్ష్మి, నట్టువాగం : మాస్టరుగారు. గాత్రం : కనకదుర్గ. మిగతా అందరూ కూచిపూడి ఆర్ట్ అకాడమీవారు.

## 14

లక్ష్మి, విశ్వనాథన్ దంపతుల కుమార్తె సౌ॥ మీరాకు, చి॥ రవిశంకర్‌కు (కళ్యాణ కృష్ణన్ దంపతుల కుమారుడు), ఈ ఉదయం ఏడున్నరకి కన్యాలగ్నంలో, నారాయణీ అమ్మాళ్ కళ్యాణ మండపంలో, వేదోక్త విధులతో సశాస్త్రీయంగా వివాహం జరిగింది. సాయింత్రం రిసెప్షన్ చంద్రశేఖరన్ వీణానాదంతో..... లక్ష్మి, చిల్డ్రన్స్ గార్డెన్ స్కూలులో, చాలా సంవత్సరాలుగా మా శారదాంబ కొలీగ్. అంతే కాదు, ఆమె బ్రదర్, బంధువులు, విశ్వనాథన్, పెళ్లికూతురు మీరా - అందరూ బాగా తెలిసినవారు.... మీరా రవిశంకర్‌ల దాంపత్య జీవితం శోభాయమానంగా సాగాలని మా

## 19

అమెరికన్ సెంటర్ ఆడిటోరియమ్‌లో, సాయింత్రం అయిదున్నర నుంచి ఆరున్నరదాకా 'వరల్డ్ నెట్ వర్క్' లో గల్ఫ్ సంక్షోభంపై టెలివిజన్ చర్చ. న్యూ ఢిల్లీ, కొలంబో, ఢాకాల నుంచి ప్రశ్నలు వేయగా, వాటికి సమాధానం వాషింగ్టన్ నుంచి రిచర్డ్ హాస్ చెప్పడం. అమెరికన్ అధ్యక్షుని సలహా విభాగంలోని, సమీప ప్రాచ్య ఆగ్నేయాసియా వ్యవహారాల సంఘానికి డైరక్టరు ఈ రిచర్డ్ హాస్.... 'ఆడియోలింకప్' ద్వారా ప్రశ్నలు వినిపిస్తాయి ; సమాధానాలు చెప్పడం కనిపిస్తూ, వినిపిస్తుంది. ఈ వరల్డ్ నెట్‌వర్క్ డైలాగు, సాటిలైట్ ద్వారా అప్పటికప్పుడు జరుగుతుంది - దీనిని 'టెలి కాన్ఫరెన్స్' అంటారు

.... ఢాకా, కొలంబోల నుంచి పాల్గొన్న వారి పేర్లు మనకంతగా తెలియవు గాని న్యూ ఢిల్లీ నుంచి పాల్గొన్నది. 'హిందూ'కి చెందిన కాత్యాల్, 'ఇండియా టుడే' శేఖర్ గుప్త, 'పిటిఐ' శశికుమార్ - వీరు ముగ్గురూ మన పాఠకులకి దగ్గిరవారు; భారతీయ దృక్పథం ఆకళింపు చేసుకున్నవారు .... 'ఆంక్షలు ఫలవంత మవుతాయా? ఈ ఆంక్షల కారణంగా కువైట్ నుంచి ఇరాక్ వైదొలగుతుందా?' అని అడిగిన ప్రశ్నకు, 'బేషరతుగా ఇరాక్, కువైట్ నుంచి తప్పుకోవడమే ఐక్య రాజ్య సమితి లక్ష్యం - ఆ లక్ష్య సాధనే అమెరికా ధ్యేయం కూడా. ఆంక్షలు ఇరాక్ వైఖరిలో మార్పు తేగలవనే అందరం ఆశిస్తున్నాం. ఇన్ని దేశాలు ఒకటిగా నిలబడి, దురాక్రమణని గర్హించడం, సభ్య ప్రపంచానికి విజయ సోపానం' - అన్నారు రిచర్డ్ హాస్. 'పశ్చిమాసియాలో సైనిక స్థావరాలు ఏర్పరచుకుంటున్న అమెరికా, అక్కడ నుంచి తప్పుకోవడమనేది జరుగుతుందా?' అనే మరో ప్రశ్నకు, 'లక్ష్యం నెరవేరిన మీదట ఒక్కరోజు కూడా వుండవు అమెరికన్ సేనలక్కడ.... పునర్వ్యవస్థీకరణ చెందిన కువైట్, వెనకటి మాదిరి ఉండకపోవచ్చు. కాని, కువైట్‌ని ప్రపంచ పటం నుంచి తుడిచి వెయ్యటం, మేమే కాదు, ఎవరూ వొప్పుకోరు' - అన్నారు రిచర్డ్ హాస్. గంటసేపు జరిగిన ఈ టెలికాన్ఫరెన్స్ ఎంతో అర్థవంతంగా ఉంది.

ఏమాత్రం తడుముకోకుండా అమెరికా దృక్పథాన్ని తేటతెల్లం చేశారాయన. 'అన్నీ మనం ఆశించినట్లు జరగక పోవచ్చు; కాని, కర్తవ్యపాలనలో వెనకాడ కూడదు' - అన్నారు రిచర్డ్ హోస్.... సభ్య మానవాళి ఏకతాటి మీద నడవటం మానవ ప్రగతికి శుభ సూచకమని అందరం వొప్పుకోవాలి.

..... 21

యావద్భారతఖ్యాతి గాంచిన భారత్ కల్చరల్ ఇంటిగ్రేషన్ కమిటీ, మద్రాసు తెలుగు అకాడమీల చీఫ్ కన్వీనరు టివికె. శాస్త్రి జ్యేష్ఠ పుత్రిక సౌ॥ విజయలక్ష్మికి, వి ఎస్ ఆర్ ఆంజనేయులుగారి (నైవేలి) కుమారుడు చి॥ సురేష్‌కు మాఘమాసములో కళ్యాణోత్సవము జరుపుటకుగాను, ఈ సాయంత్రం ఏడు గంటల పది నిముషాలకు వుడ్‌లాండ్స్‌లో శాస్త్ర సమ్మత విధులతో నిశ్చితార్థం జరిగింది. అబ్బాయికి ఆడ పెళ్లివారు, అమ్మాయికి మగపెళ్లివారు నూతన వస్త్రబహూకరణ గావించారు. అబ్బాయి తలిదండ్రుల చేత పూజా విధానం జరిపించిన పురోహితుడు, నిశ్చయ తాంబూల పత్రిక చదివాడు. లాంఛన ప్రాయమైన యిచ్చిపుచ్చు కోవడా లయాక, మగపెళ్లివారు పెట్టిన కొత్త చీరె కట్టుకు వచ్చి, అబ్బాయి పక్కన పీటల మీద కూచుంది అమ్మాయి. ఇదరూ కలశానికి పూజ చేశాక, ఉంగ రాలు మార్చుకోవడం - ఒకరి వేలికి మరొకరు తొడిగారు. సమంత్రక వివాహం యిరువైపుల వారి వీలుని బట్టి మాఘమాసంలో.... ముత్తయిదువులు ఆ జంటకు హారతి ఇచ్చారు. పారిశ్రామిక వేత్త ఓబుల్ రెడ్డి, వ్యాపార వేత్త రమణయ్యరాజా, వీణా చిట్టిబాబు మున్నగు ఆహూతులు శుభాక్షితలు చల్లారు.... ఆ తర్వాత గడ్డపెరుగూ, పాయసంతో విందు.... శాస్త్రిగారు ఏది తల పెట్టినా గ్రాండ్ స్కేల్లోనే! సరిపెట్టడిం, సరి పెట్టుకోవడమనేది స్వభావంలోనే కాదు. ఆత్మవిశ్వాసమే ఆయనను అన్నిటా కవచమై కాపాడుతోంది.

..... 29

ఘంటసాలవారి పైడాబా మీద, సంగీతరావుగారి రెండో అబ్బాయి అడ్వకేట్ గోపి, తెలుగులో 'పట్టిమంద్రం' ఏర్పాటు చేశారు. తమిళంలో ఈ సాహిత్య ప్రక్రియ బాలా పాప్యులర్. తెలుగులో, చర్చావాటిక అనిగాని, చర్చావేదిక అనిగాని అన వచ్చు. ఈనాటి అంశం: పిల్లల విషయంలో పెద్దల జోక్యం. ఉండ కూడదని పప్పు వేణుగోపాలరావు, సాయీ ప్రసాద్ లలిత; ఉండాలని దుర్గాప్రసాద్, రమణ, రమణమ్మ. ఈ టీమ్‌లో ఒకరు, ఆ టీమ్‌లో ఒకరు పదేసినిముషాల చొప్పున ప్రసంగిస్తారు. ఆరుగురూ చెప్పడమయాక, యిటు లీడర్‌కి, అటు లీడర్‌కి అయిదేసి నిముషాల 'సమ్మింగ్‌అప్' అవకాశం. ఇరుపక్షాల వాదోపవాదాలు విన్న మధ్యవర్తి తీర్పు చెబుతారు - ఈనాటి సమావేశానికి

ఆ బాధ్యత బియస్సార్ కృష్ణాది. ఆడియన్స్‌లో నుంచి గొల్లపూడి మారుతీరావు, మల్లిక్ తమ అభిప్రాయాలు తెలిపారు.... పిల్లల విషయంలో పెద్దల జోక్యం అన్నప్పుడు, పిల్లలు అంటే సంతానమనీ, పెద్దలు అంటే తలిదండ్రులని మనకి బోధపడుతుంది. తమ విద్యావకాశాలకు పిల్లలు, తలిదండ్రుల మీద ఆధారపడుతున్నప్పుడు, ఆ తలిదండ్రులు తమ అభిరుచులు, అభిప్రాయాలు పిల్లలపై రుద్దకమానారా? తాము చెప్పినదే రైటు అనే పట్టింపు పెద్దలకి వుండకుండా వుంటుందా? పెళ్లి విషయం వచ్చేదాకా ఈ జోక్యం ప్రశ్నార్థకంగా పరిణమించదు. పిల్లలు తలిదండ్రులని చూసి నేర్చుకుంటూనే, తరాల అంతరాల వల్ల భిన్నంగా ప్రవర్తిస్తూంటారు .... ఈనాటి 'పట్టిమండ్రం'లోని ఇరుపక్షాల వాదాలూ సామాన్యంగా ఉన్నప్పటికీ, అడ్వకేట్ గోపి తలపెట్టిన కొత్త ప్రయత్నం ఎంతో మందిని ఆకర్షించింది; ఒక నూతన సాహిత్య ప్రక్రియకు ద్వారాలు తెరిచింది. మొదటి సమావేశమే యింత ప్రోత్సాహజనకంగా ఉందంటే








ముందు ముందు యింకా బాగా రాణి స్తుంది.

. . . . . 30

ఒక లేడీ జర్నలిస్ట్, అందునా తెలుగు లేడీ జర్నలిస్ట్, ఈ మహా నగరంలో తనకంటూ ఒక ఇల్లు ఏర్పరుచుకోవడం అభినందనీయమగు విషయం. పాటిబండ్ల విజయలక్ష్మి పదిపన్నెండేళ్లుగా బాగా తెలుసు. ఆమె చక్కటి నవలలు రాసింది; హృదయాన్ని కదిలించి కనులు చెమర్చే కవిత అల్లింది. కాని, కథలూ కల్పనలూ గాక నిలదొక్కు కునేందుకు సినీ జర్నలిస్ట్ అయింది. తెలుగు సినీ ప్రపంచంలో అందరూ ఆమెనెంతో అభిమానంగా చూస్తారు. అయితే ఆ అభిమానం వేరు, జీవన పోరాటం వేరు.... పోయిన సంవత్సరం ఆరు వారాలు అమెరికాలో ఆమె సిస్టర్ దగ్గిర గడిపి వచ్చాక, 'మీ ట్రావెలోగ్ వ్రాయకూడదా, విజయలక్ష్మి?' - అని అడిగాను. 'ఎవరిక్కావాలండీ అవి?' - అన్నదామె. ఒక విధంగా ఆమె చెప్పినది నిజమే. తెలుగు పత్రికా ప్రపంచపు తీరుతెన్నులు ఆ ప్రకారం ఉన్నాయి.... 'అందాల భావి - అంధకారపు బావి కాగా - మిగిలాను ఒంటరిగా - మెడల్ చేతపట్టుకొని.... మంచితనానికి శాస్త్రిగా - మానవత మరణించింది - విప్లవజ్యోతి వెలిగించింది' ('టానా' వారి ప్రత్యేక సంచిక లో) అనే కవితా హృదయం గల విజయలక్ష్మికి, నూతన గృహప్రవేశ సందర్భంగా మా మనః పూర్వక శుభాకాంక్షలు.

1990 అక్టోబరు 02

"'గాంధీగారు సత్యానికి, అహింసకు ప్రతిరూపం - మనస్సాక్షి తర్వాతనే మిగతా ప్రపంచ మన్నారు. ఆయన గురించి ఎంతో చెప్పకోవచ్చు, ఎన్నో చెప్పుకోవచ్చు. అయితే, వీటన్నిటికీ మించిన గొప్పతనం, మీకు కనిపించిన గొప్పతనం, చెప్పండి' - అని నేను ఒకసారి మురార్జీ దేశాయ్‌ని, కేంద్రప్రభుత్వంలో సెక్రటరీగా వున్న రోజులలో అడిగినప్పుడు, ఆయన ఒక్క ముక్కలో చెప్పారు - 'ఫియర్ లెస్‌నెస్' (భయ రాహిత్యం). మనందరికీ ఏవేవో భయాలు వుంటాయి. కాని, ఏపరిస్థితిలోనూ ఎటు వంటి భయమూ కించిత్ కూడా లేని మహనీయుడాయన. భారతదేశానికే కాదు, సర్వ ప్రపంచానికీ ఆయన ఒక వర ప్రసాదం. అవలంబించే మార్గము పరిశుద్ధమైతే తప్ప లక్ష్యసిద్ధి నైతికంగా సమర్ధనీయం కాదన్నారు (Ends and Means). అటెన్‌బరో 'గాంధీ' చిత్రాన్ని మనదేశంలో కంటె విదేశాలలో ఎక్కువ ఆదరించారు. గాంధీజీ భావనా స్రవంతి తెలుసు కునేందుకు స్వామినాథన్ రచించిన 93 సంపుటాలు చదవాలి. ఆ గ్రంథ సముచ్చయం లేని లైబ్రరీకి నిండు తనం రాదు. ఈ సంస్థ వారు తమ గ్రంథాలయంలో ఆ సంపుటాలు భద్రపరచగలరని ఆశిస్తున్నాను" -

అన్నారు, పొట్టి శ్రీరాములు హాలులో 122 వ గాంధీ జయంతి నాడు, విద్యార్థులు - అనుభవజ్ఞులు అయిన రంగభాష్యం. సంస్థ కార్యదర్శి వైయస్ శాస్త్రి ప్రాసంగికులకు, ఆహూతులకు స్వాగతం తెలిపారు. ముఖ్యఅతిథిగా విచ్చేసిన ప్రొఫెసరు దేవదాస్ గాంధీ వాఙ్మయంపై, గాంధీ సిద్ధాంతాలపై పరిశోధన జరిపి, గ్రంథాలు వ్రాశారు; అమెరికా, యూరప్‌లలో ఉపన్యాసాలిచ్చారు. మద్రాసు విశ్వవిద్యాలయంలో రాధాకృష్ణన్ ఫిలాసఫీ విభాగానికి డైరక్టరాయన. "గాంధీగారు మాన్ ఆఫ్ యాక్షన్ - చెప్పేదానికీ, చేసేదానికీ తేడాలేదు. ఆ కర్మ యోగిత్వమే ఆయనని అంతఎత్తున కూచో పెట్టింది .... ఒకప్పుడు బాలెన్స్ ఆఫ్ పవర్ రాజనీతి; ఇప్పుడు బాలెన్స్ ఆఫ్ టెర్రర్. ఈ టెర్రరిజమ్ రోజులలో గాంధేయ సిద్ధాంతాల అవశ్యకత మరింత కొట్టొచ్చినట్టుగా కనపడుతోంది. టాల్‌స్టాయ్, రస్కిన్, థొరొ - ముగ్గురి ప్రభావం గాంధీజీ ఆలోచనా విధానంపై ఉంది.... మనసు లోలకం లాటిది - ఇటూ అటూ వూగిసలాడుతుంది. కాని, అంతర్వాణి (ఇన్నర్ వాయిస్) ఏది మంచిదో స్పష్టంగా చెబుతుంది. సిద్ధాంతానికి కట్టుబడని రాజకీయాలు వుండరాదనేదే సర్వోదయం.... వినోబాభావె నిష్క్రమణతో గాంధీ కుటుంబంలోని మరొక వ్యక్తి తెరమరుగైనట్టు !.... కేంద్రీకరణ అధికార దాహాన్ని పెంచుతుంది. వికేంద్రీకరణ ద్వారానే ప్రజానీకం ప్రజాస్వామ్య జీవన సరళి వైపుగా పయనించ గలుగుతుంది. గాంధీగారిని మనం పూర్తిగా మర్చిపోయాము ; తాత్కాలిక ప్రయోజనాలకు మించి

## సినిమా పేరు ?

**కాకి నలుపు, కందెన నలుపు-చీకటి నలుపు, తాటకి నలుపు**
**పరులనుదోచి, అరలోదాచె - పాపపుసొమ్ము, కారు నలుపు**

గేయరచన : నారాయణరెడ్డి ; పాడినవారు : యస్పి బాలసుబ్రహ్మణ్యం

ఆ పాట ఏ చిత్రంలోనిది ? సరిగా చెప్పగలిగిన మొదటి యిరువురికీ పదేసి రూపాయలు బహుమతి. ఎక్కువ మంది చెప్పగలిగినప్పుడు, చీట్లువేసి, మొదటి యిరువురికే బహుమతి ఇవ్వడం జరుగుతుంది.

మీ జవాబు కార్డుమీదనే వ్రాయండి : చివరి తేది : **10-12-1990**



JAGATI, 2, Kutchery Road, PB 2922, Mylapore, Madras-600 004.

దూరం చూడలేని హ్రస్వదృష్టి అయిపోయింది మనది. ఆయన పేరు మీదుగా భవనాలు, టోపీలు తప్ప యింకేమీ మిగలలేదు.... మనజాతి పునరుజ్జీవనానికి గాంధీయిజమ్ ఒక్కటే రాచబాట" - అన్నారు దేవదాస్. అధ్యక్షత వహించిన ఎంబెరు మన్నార్ చెట్టి వక్తల నిద్దరినీ పుష్పమాలాలంకృతులు గావించారు. ఈనాటి విశేషమేమిటంటే, శ్రోతలలో ఒక్కరు కూడా చివరిదాకా కదలలేదు.

## 04

ఇప్పుడు మద్రాసులో కనీసం మరొక రెండువేల హోటల్‌రూమ్స్ ఆవశ్యకత ఉంది. వారం పదిరోజుల ముందు బుక్ చేసుకుంటే తప్ప, ఆధునిక సౌకర్యాలు గల హోటల్ రూమ్ దొరకదు. రైలుదిగి, హోటల్ కెళ్లి, రూమ్ అడిగేరోజులు ఏనాడో పోయాయి. హోటల్ పరిశ్రమలో 'అక్యుపెన్సీ' అరవై డెబ్బయి శాతానికి తగ్గకూడదు; ఎనభై శాతం వుంటే లాభదాయకమే! పేరు పడ్డ హోటల్స్‌లో 'అక్యుపెన్సీ' రేటు ఈనాడు తొంభయి, తొంభయ్యయిదు శాతం ఉంటోందట.... దర్శక నిర్మాత విజయనిర్మల తమ యింటి కెదురుగా, విజయకృష్ణ ఆఫీసు నంటిపెట్టుకు, మూడు అంతస్తులలో ఇరవై ఏడు రూమ్స్‌గల చక్కటి హోటల్ కట్టించారు. వళ్లువార్ కొట్టమ్‌కి, కోడంబాకమ్ బ్రిడ్జికి మధ్య పెరియారు రోడ్‌లో ఉంది - (నెంబరు 21 - ఫోను : 8251125) హోటల్‌నవీన్ ఇంటర్నేషనల్. మూడురోజుల క్రితం ప్రారంభోత్సవం జరిగింది - ఇవ్వాళ పాత్రికేయుల పార్టీ. కృష్ణ, విజయ నిర్మల స్వయంగా దగ్గరుండి చూపించారు హోటల్‌రూమ్స్, ప్రతిరూమ్ లోను టివి, టెలిఫోన్, ఛానెల్ మ్యూజిక్, విశాలమైన బాత్, అధునాతన ఫర్నిచర్, గోడబోసిగా వుండకుండా భావగర్భితమైన పెయింటింగ్ - మొత్తంమీద ఎంతో సదుపాయంగా ఉంది - అన్నీ డబుల్‌రూమ్స్. ఒక్కరు మాత్రమే ఉంటే ఏభై తగ్గుతుంది. నాసి - ఎసి రోజుకి రెండువందలు; ఎన్. రెండు వందల యాభై. నేటి హోటల్ రేట్స్‌తో పోల్చిచూస్తే తక్కువనే చెప్పాలి.... 'నిర్మల్' అనేపేరుతో బ్యూటీపార్లర్ (స్త్రీలకు మాత్రమే), 'రుచి' అనే రెస్టారెంట్ 'హోటల్ నవీన్ ఇంటర్నేషన'బని అంటి పెట్టుకు వున్నాయి. వచ్చే సంవత్సరం ఈనాటికి యిక్కడ రూమ్ దొరికేందుకు, రికమండేషన్ అవసరమైనా ఆశ్చర్య పోనక్కర్లేదు, రూమ్స్ చూడటానికి వెళ్లేముందు కాఫీలు తీసుకుంటున్నప్పుడు హీరో కృష్ణని అడిగాను : 'ఇదేమిటి, మీరు ఢిల్లీలో వుండవలసినది - యిక్కడ వున్నారేమిటి?' - అని. 'ఫ్లయిట్‌కి రిజర్వ్‌చేసి కూడా ఈ యాంటీ మండల్ యజిటేషన్‌లో ఏర్‌పోర్టునుంచి పార్లమెంట్ హవున్‌కి చేరుకోగలనో లేదో అని సందేహించాను' - అన్నారు కృష్ణ-తన సహజ దరహాసంతో.... (పి అర్ ఓ : రాజు)

పెరియార్ రోడ్ నుంచి పెద్దరోడ్డు మీదికి రాగానే యమ్‌యమ్ థియేటర్‌లో యమ్‌యమ్ మూవీ ఆర్ట్స్ వారి 'లక్ష్మీదుర్గ' పాటల ప్రదర్శన. లోగడ 'శ్రావణ శుక్రవారం' తెలుగు ప్రేక్షకులకు సమర్పించిన ఎడిటర్ మోహన్ ఈ అనువాద చిత్రానికి నిర్మాత. మాటలు, పాటలు : రాజశ్రీ. 'జగదేకవీరుడు .... 'అంజలి' తో, వండర్‌గర్ల్ అయిన బేబీషామిని ఈ పిక్చర్లో ద్విపాత్రాభినయం చేస్తుంది ; ఈ బాలికకు తోడుగా ఒక శునకం, ఒక మర్కటం ఉంటాయి. వీరు ముగ్గురూ విడదీయరాని ఫ్రెండ్స్ .... 'బ్రేకడాన్స్‌లే మేం ఆడుతాం - పాప్‌సాంగులే మేము పాడుతాం.... అందమైన బుట్ట బొమ్మలం - వాడిపోని మల్లె పువ్వులం' అంటుంది దుర్గ (సంగీతం : శంకర్ - గణేష్; గాత్రం : చిత్ర మున్నగువారు).... 'అమ్మా మా దుర్గమ్మా తల్లీ కల్పవల్లి - రేయిపగలు నిన్నే నిన్నే పూజిస్తాం' (గాత్రం : శైలజ మున్నగువారు) అని వేపమండలు పుచ్చుకు, పసుపుపచ్చ రంగుచీరెలు మోకాళ్లవద్దకు కట్టి, ఆషాఢమాసాన మంటల్లో నడిచేటివేళ అవి కర్పూర మాలలవటం నీవల్లనే తల్లీ అంటూ, వీరాంగం చేస్తారు - వొంపు సొంపులు గల వనితలు. జనాకర్షణీయ లక్షణాలు గల చిత్రమనిపించింది పాటలు నాలుగూ చూసిన మీదట.... పి ఆర్ ఓ : అర్జునరావు.... అక్కడ నుంచి 'నడిగర్ సంగమ్' లోని 'నవయుగం' ప్రదర్శనకు.

. . . . . 09

పారిశ్రామికవేత్త ఓబుల్ రెడ్డి, మ్యూజిక్ అకాడమీ అధ్యక్షులు టిటి వాసు మున్నగువారి సహకారంతో కస్తూరి శ్రీనివాసన్ హాలులో యువతకు ప్రోత్సాహ మిచ్చేందుకైన స్పిరిట్ ఆఫ్ యూత్ ఫెస్టివల్ (Spirit of Youth Festival) సందర్భంగా కెజె సరస శిష్యురాలైన నాగప్రియ భరత నాట్యం సాయంత్రం ఏడుంపావుకి. పాపనాశనమ్ శివంతో ప్రారంభించి దండాయుధ పాణి కృతిని (తిరుమ లేశుని వేడుకొనే నాయిక) తన నాట్య విద్యా కౌశలంతో ఎంతో చక్కగా మెప్పించింది నాగప్రియ.

—యన్నార్ చందూర్



ధనవంతునిగా మరణించడం కంటే ధనవంతునిలా జీవించడం హాయి.

సోమరిగా ఉన్నప్పుడు ఏకాంత చింతన రానీయకు ; ఏకాంతంగా ఉన్నప్పుడు సోమరిభావం రానీయకు.

ఎవరినీ నమ్మకుండా వుండటం కంటే నమ్మి మోసపోవడంలో సుఖం వుంది.

ఎక్కడైతే రహస్యమూ, మిస్టరీ ప్రారంభమవుతాయో అక్కడే జనిస్తాయి దుష్టత్వమూ దగుల్బాజీతనమూను.

తమకి పుట్టినే యిచ్చిన పుస్తకాన్ని సాధారణంగా చదవరు. డబ్బుపెట్టి కొనివుంటే తప్పకుండా చదువుతారు.

—జాన్సన్

# చందూర్ రచనలు

నేటి విలువలు
దూరాన్ని జయించిన మానవుడు
ఛార్లెస్ స్టీన్‌మెజ్
కథానికలు
జీవనమార్గం
ఎలినార్ రూజ్‌వెల్ట్
తొలి పాఠాలు
ప్రేమగాథ
హెలెన్ కెల్లర్
డా॥ మేరి వర్ఘిస్
నేల - నీరు
మహా నగరంలో
జీవితం
నవచైనా
ప్రతి గురువారం
ఆరు కథలు
చెట్లు
మరొక ఆరు కథలు
ఈ నాగరికత
నాలుగు రోడ్లు
అణుశక్తి
బాలరాజ్యం
గ్రామ వైద్యుడు
సాహస యాత్ర

కాఫీ మానెయ్యటం

పరిచయం చేసిన పుస్తకాలు
అన్యాయం

ఎక్కడికి కమలా ?
భానుమూర్తి భార్య
రాధ నవ్వింది
కొత్త లోకాలు
కొన్ని గ్రంథాలు
సీతతో సినీమాకు
ప్రజానాయకుడు ప్రకాశం
నట్టింట దీపం
మాంగుళూర్ మెయిల్
మహాబలిపురం
మనకీ ఒక కారు
సీతా ఫలాలు
భాష
పూసల మేడ
శివరావు
కలడోలేడో
మావో పాలనలో
చైనాలోమైనారటీలు
అమెరికా
జులై నాలుగు
వరదల్లో వాంగ్
మాతా భూమాతా
చీమలబారు

**వీటిలో ఏ ఒక్కటీ ప్రస్తుతం అచ్చులో లేవు. చదవాలనుకున్నవారు మీకు చేరువలోనున్న లైబ్రరీలో దొరికితే చదవండి**

## సమీక్షలు చిత్రజగతి

### లక్ష్మీప్రసన్న వారి 'అల్లుడు గారు'

అమ్మాయిగారి (శోభన) తండ్రి అమెరికాలో ఉంటాడు. ఆయనకి హార్ట్ కంప్లయింట్ అవటం వల్ల తన కూతురు పెళ్లి తొందరగా జరగాలనే కోరిక, గిరిజన ప్రాంతంలోవున్న వారి ఆస్తిని గెద్దముక్కు పురుషోత్తం (గొల్లపూడి మారుతీరావు) ఆయన సుపుత్రుడు (సుధాకర్) వీలైనంత కబళిస్తూ వుంటారు. అమ్మాయిగారి గార్డియన్ అంకుల్ (చంద్రమోహన్). అతను చాలా మంచివాడు - మేనకోడలు యోగక్షేమాలు మనసారా కోరినవాడు .... ధనవంతురాలైన హీరోయిన్ చేసేటట్లు ఈమె ఒక యువకునికి తన హృదయ ధనం అర్పిస్తుంది అయితే ఆ యువకునికి కావల్సినది కేవలం ధనంగాని హృదయం కాకపోవడంతో హతాశురాలవుతుంది. అమాంత్రం పితాజీ అమెరికా నుంచి రానున్నాడు. ఆయన గుండెకాయకు ఏ విధమైన యిబ్బందీ కలగకుండా, అంకుల్ ఒక పథకం వేసి, పదివేలు రేటు మాట్లాడి ఒక కిరాయి అల్లుడిని, ఈ సుంద రాంగి భర్తగా నటించేందుకు పట్టు కొస్తాడు. అల్లుడు గారు (మోహన్ బాబు) రంగప్రవేశం గావించడంతో, ఈ రొమాన్స్ మనని అడుగడుగునా నవ్విస్తూ, సంచలనాత్మక పరిణామంతో ముగుస్తుంది. దర్శకత్వం: కె రాఘ వేంద్రరావు.... పిఆర్ఒ: ప్రమోద్ కుమార్.

### గీతా ఆర్ట్స్ 'ప్రతిబంధ్'

మెగాస్టార్‌గా కీర్తి ప్రతిష్టలందు కున్న చిరంజీవిని హిందీ తెరకు పరి చయం చేస్తున్న చిత్రమిది - లోగడ తెలుగులో వచ్చిన యమ్మెస్ మూవీస్ వారి 'అంకుశం'కు హిందీ వెర్షన్ - చిరంజీవి 109వ పిక్చర్... తల్లి దండ్రులెవరో తెలియని అనాథ బాలుని. మేస్టారు (జెవి సోమయాజులు) చేరదీసి, విద్యాబుద్ధులు నేర్పి, పెంచి పెద్దచేయగా, అతను పోలీసు ఇనస్పెక్ట రవుతాడు నీతి నిజాయితీలు, రుజు వర్తన, సంఘ క్షేమం, విధినిర్వహణా బాధ్యత - యిటువంటి మంచిగుణాలు గల ఇనస్పెక్టరు (చిరంజీవి), నిరం

తరం విద్రోహశక్తులతో పోరాడ వలసివస్తుంది. మేస్టారు ముఖ్యమంత్రి అవుతాడు. పదవీ కాంక్షితులు, ధనాశాపీడితుల మధ్య 'నల్లని వన్నీ నీళ్లు తెల్లని వన్నీ పాలు' అనుకొనే అమాయకుడాయన. తన భార్యని సైతం ఈ వైరంలో కోల్పోయిన ఇన స్పెక్టర్, స్వహస్తాలతో కపట వేష గాళ్లని చంపి, తన ప్రాణత్యాగంతో ముఖ్యమంత్రిని బాంబు ప్రమాదం నుంచి కాపాడి, ఆశయమనే అగ్నిలో తన జీవితాన్ని సమిధిగా చేస్తాడు. ఫైటింగులు వున్నప్పటికీ, చెప్పదలుచు కున్నదానిలో యువతను స్పందింప జేయగల తీవ్రత ఉంది. నిర్మాత: అల్లు అరవింద్, దర్శకత్వం: రవి రాజ్.... పి ఆర్ ఒ: రామకృష్ణ.

## టి. కృష్ణ మెమోరియల్ 'నవయుగం'

ఒక మధ్య తరగతి కుటుంబీకునికి (వేలు) ఇద్దరబ్బాయిలు. పెద్దవాడు సూర్యం (వినోద కుమార్) మాఫియా నాయకుడు గురుదేవ్‌ని (బాబూరావు) జైలుకి పంపి, ఆ తర్వాత సంఘ విద్రోహశక్తులు పన్నే వుచ్చులో ఇరు క్కొని, అడవుల పాలై, ప్రజాకళా కారునిగా ఈ వ్యవస్థపై ధ్వజమెత్తు తాడు. తమ్ముడు సత్యమూర్తి (రాజేంద్ర ప్రసాద్) బి.యల్. పట్టా పుచ్చుకు, ప్రఖ్యాతుడైన ఒక వకీలువద్ద జూనియర్‌గా చేరుతాడు. ఈ సత్య మూర్తి కలియుగ సత్య హరిశ్చంద్ర మూర్తి అవటంవల్ల, న్యాయ వ్యవస్థ పోలీసు శాఖ రెండూ అతనికి అవినీతి మయంగా, ప్రజా వంచకులకి అమ్ముడు పోయి, సామాన్యులని కొరుక్కు తినేవిగా కనిపిస్తాయి. కని పించడమే కాదు, అతనిని విస్మయ పరిచే సంఘటనలు ఆ నమ్మకాన్ని దృఢతరం చేస్తాయి. మెడలో పాతిక మాంగల్యాలతో అవమానింప బడ్డ సుమతిని (మీనా) తన భార్యగా స్వీకరిస్తాడు. పగ, రక్తపాతమూ, ఆటవికత, కక్ష సాధింపు చర్యలూ గల ఈ చిత్రంలో రాజేంద్రప్రసాద్ నటన, పాత్రకు మెరుగు పెట్టింది. బాబూరావు నటనాకౌశలం ప్రసంశ నీయకంగా వుంది. మాటలు; హరనాథ రావు, దర్శకత్వం: ఆదిత్య.... పిఆర్ఒ: పసుపులేటి రామారావు.



ఫలరాజమా, నీవు నాకెంత దూరం? - పూబాలా, నీ హృద యంలో నేనున్నాను.

రాగ స్రవంతి హృదయంలో ఉన్నప్పుడే సౌశీల్యమనే సంపద సమ కూడుతుంది.

పిచ్చుకకెప్పుడూ, నెమలి అంత పెద్దతో కని, ఎలా మోయగలుగు తున్నదా అని విచారం.

ఈ సృష్టి రహస్యం నిశీధి అంత నిగూఢమైనది. ప్రాతఃకాలపు పొగ మంచులోని అస్పష్టాకృతిని పోలినది వివేకజ్ఞానం.

—టాగూర్

పీరియల్

# మధు స్వప్న శాఖ

## పూజిత

గడిచిన కథ: ప్రమీలా సూర్యారావుల సంతానం విశాల, శర్మిల, విమల. సివిల్ ఇంజనీరైన విశాలపై, డాక్టరు నాగార్జునకి ఎంతో అభిమానం; అయితే ఈ డాకరుపై లావణ్య ఆశలు పెంచుకుంటున్నది. నాగారున చెల్లెలు చందన, విశాల మంచి ఫ్రెండ్స్. అంతా సవ్యంగా ఉందనుకున్న చోట అనుకోని ఆటంకాలు తల ఎత్తుతాయి .... (ఇకచదవండి.

"ఎందుకనేది అంత సులభంగా వివరించలేను.... నేను చెప్పినట్లు చేయండి."

"చెప్పండి, ఏమి చేయమంటారు....?"

"మీరు అనవసరంగా ఎక్సయిట్ అవుతున్నారు. ఇది ఒక్కరోజులో అయ్యేది కాదు. ఇన్వెస్టిగేట్.... చేయాలి.... నిదానంగా అసలు.... విషయం కనుక్కోవాలి. ప్రస్తుతం మీరు ఇలా చేయండి."

"డాక్టరుగారు వూరిలో లేరు. అర్జంట్‌గా ఎక్కడికో వెళ్ళవలసి వచ్చిందట. వచ్చేందుకు వారం పడుతుందట.... రాగానే వస్తానని లావణ్యకు కబురు పంపమని చెప్పి, మరీ వెళ్లారట. అంత వరకు ఈ మందులు వాడమన్నారట అని చెప్పండి. ఆమె ఎలా వుంటున్నదీ.... ఎప్పటి కప్పుడు, ఆమె వినకుండా ఫోను ద్వారా నాకు తెలియపరుస్తూ వుండండి. నేను వూరిలోనే వున్నట్టు ఆమెకి తెలియ కూడదు," అని చెప్పాడు నాగార్జున.

ఆయన కళ్ళల్లో ఏదో తృప్తి. "డాక్టర్,.... మీ ట్రీట్‌మెంట్ ద్వారా మా లావణ్య నార్మల్ అయితే, ఆ జన్మాంతరం మీకు రుణ పడి వుంటాను," అన్నాడు శ్రీనివాసరావు.

### 28

శర్మికి లక్ష రూపాయల కట్నంతో వివాహం నిశ్చయమైంది. అన్నీ ఏర్పాట్లు జరుగుతున్నాయి. "డాడీ మీరు ఎక్కువ శ్రమ పడవద్దు. అన్ని నేను చేసుకుంటాను. మీరు విశ్రాంతిగా వుండండి" -తండ్రితో చెప్పింది విశాల.

"అమ్మా! మగదిక్కులా ఈ ఇంటికి అన్ని నీవే చూస్తున్నావు.... నిజంగా ఇది నా అదృష్టం" అన్నారాయన.

"డాడీ.... మగ, ఆడ అనే విభేదం మరచిపోండి. ఏ.... బిడ్డయినా ఒకటే.

ఆడవాళ్ళు చేయలేనిది, మగవాళ్ళు ఏమిచేస్తారు? అయితే కాస్త ధైర్యంగా నడుచుకోవాలి.... అంతే కదా డాడీ."

విశాల తన తొలి జీతం అందుకుని తల్లికి పట్టుచీర తండ్రికి జరీపంచె.... కండువా.... విమ్మి.... శమ్మికి వాళ్ళకు ఇష్టమైనవి తెచ్చిచ్చి,.... తల్లి దండ్రుల కాళ్ళకు నమస్కరించింది.

అనిర్వచనీయమైన ఆనందానికి లోనయ్యారు తలిదండ్రులు. విమ్మి, శమ్మి కూడ సంతోషపడ్డారు. తమకి తెచ్చిన ప్రజంట్స్ చూసి తల్లి తండ్రి విశాలను మెచ్చుకుంటుండేసరికి, ఆ సంతోషంలో కాస్తంత అసూయ లేక పోలేదు - అయినా బయట పడలేదు. ఇద్దరూ !

చందనకు తెచ్చిన ప్రజంట్ తీసుకుని వాళ్ళ ఇంటికి వెళ్ళింది విశాల ఆ సాయింకాలం.

నాగార్జున కూడ ఇంట్లోనే వున్నాడు.

"మరి.... నాకు.... ఏమి ఇవ్వలేదే .... డాక్టర్ని కదా ! కనీసం నాతో ఎప్పుడైన అవసరమని.... కూడ అనుకున్నట్లు లేదే మీరు."

"మీకా.... దాచాను అది"

"ఏమిటది ?"

"ఇప్పుడు కాదు, ఆ సమయం వచ్చినప్పుడు"

నాగార్జున నయనాలలో మధుర స్వప్నం.... "చూశావా.... అన్నయ్య .... నే చెప్పలేదూ.... స్వీటీయేకాదు .... డెంజెరెస్ నాటీ కూడా."

విశాల నేత్రాలు చిలిపిగా నవ్వాయి. మా అన్నయ్యకు ఇచ్చేస్తాను.... నీవు నాకు మరొకటి ఇదువుగాని !"

"మీ అన్నయకిచ్చేది ఇలాంటిది కాదనిచెప్పాను కదా.... అది సామాన్య వస్తువు కాదు...."

"మరేమిటి ?".... అంది చందన గుచ్చి, గుచ్చి చూస్తూ.

"ఫలం.... పుష్పం.... తోయం లాంటిది...."

"ఇంజనీరుగారు కవిత్వం మాట్లాడుతున్నారే !" అంది చందన.

"రచయిత్రి సావాస ఫలితం"

నాగార్జునకి విశాల మనసులోని అంతరార్థం.... లీలగా బోధ పడుతోంది.... అయినప్పటికీ.... తనేం చేయాలో,.... ఎలా.... ముందడుగు వేయాలో తెలియడం లేదు.

కాస్సేపు కబుర్లు చెప్పి విశాల వెళ్ళి పోయింది.

"ఎంత గుణవంతురాలో !" అంది శాంతమ్మ.

"అబ్బ.... ఆమెనే అన్నిసార్లు మెచ్చుకుంటావు.... మాకు లేదా.... మంచి గుణం ?"

"ఆఁ వుందమ్మా.... నీకు బోలెడంత, కాని, ఆ అణకువ.... ఆ కట్టు బొట్టు, ఆ మాట మంచితనం.... ఆ మర్యాద, ఆ మన్నన.... ఇంకో జన్మ ఎత్తినా, నీ కొస్తాయటే పిచ్చికా...."

"వాటికోసం మళ్ళీ పుట్టడమా వద్దులే గ్రాండ్‌మా...."

నాగార్జున తన రూమ్‌లోకి వెళ్ళి వీడియో పెట్టుకున్నాడు. నాట్య మయూరి విశాల తనని ఆనంద లోకాలలో విహరింపచేసింది.

## 29

శమ్మి వివాహం నిరాడంబరంగా జరిగిపోయింది. కట్నం అంత తీసుకున్నా పెళ్ళి ఎలా.... చేయాలో షరతులు పెట్టలేదని సంతోషించారు ప్రమీలా సూర్యారావు.

ఆడ బిడ్డల లాంచనాల దగర కూడ పేచీలు పెట్టలేదు వాళ్ళు. వాళ్ళకి కావలసింది కట్నమే.... అదీ డబ్బు రూపంగా. అది అందిన వెంటనే వాళ్ళలో అమితమైన సంతోషం. అన్నింటికి తలాడించి.... మహా మంచి వాళ్ళని పెండ్లి పందిట్లో పేరు పొందారు - శమ్మి భర్త, అమె అత్త గారు.

నాగార్జున రౌండ్స్ ముగించి వచ్చే సరికి శ్రీనివాసరావు వెయిట్ చేస్తున్నాడు.

"మీరే వచ్చారా....? ఫోన్ చేసినా సరిపోయి వుండేదికదా! రండి లోపలకు" అంటూ తీసి కెళ్ళాడు.

శ్రీనివాసరావు కూర్చున్నాడు. ఆయన ముఖంలో పిసరంత ప్రసన్నత.

"ఎలావుంది మీ అమ్మాయికి ?"

"మీరు చెప్పినట్లే చెప్పాను నిరుత్సాహపడింది గాని,.... మునుపు మాదిరి, అక్కడకి, ఇక్కడికి పోవాలనటం మానేసింది. వస్తువులు విసిరి వేయటం కూడా తగ్గించింది. ఆహారం ఇష్టంగా తినకపోయినా,.... టైమ్‌కు .... ఏదో తినాలన్నట్టు, మేము చెబితే వచ్చి కూర్చుని, తనకెంత తినాలని పిస్తే, అంత తీసుకుని, వెళ్ళిపోతోంది. అయితే చాలా మౌనంగా.... గంభీ









రంగా మాత్రం వుంటోంది. మునుపటి చేష్టలు తగ్గినా.... చాలా ఉదాసీనంగా ఉంటున్నది...."

"ఐ. సీ.... మరి దేన్ని గురించైనా మాట్లాడుతుందా....?" "వుహు అసలు మాట్లాడటమే మానేసింది, మీరు.... ఆరోజు వచ్చి.... చూడటంతో, మార్పు కన్పిస్తోంది. అంతకి మించి ఏమీ తెలియడం లేదు"

"ఓ. కె. మీరేమీ అదుర్దా పడవద్దు. అంతా సరైపోతుంది. ఎప్పుడెప్పుడు అలా స్పృహ పోయేదీ గమనించారా....?"

"పెళ్ళి జరుగుతుండగా మొదటిసారిగా స్పృహ తప్పింది. మీరొచ్చినపుడు, అది స్పృహ తప్పడమో.... మరొకటో.... నాకు.... తెలియడం లేదు"

"అంతేనా.... మళ్ళీ ... ఎప్పుడూ ....?"

"లేదు."

"సరే, మీరెళ్ళండి. నేను ఒకసారి ఆమెతో ఫోనులో మాట్లాడి.... తరువాత ఆమెను చూస్తాను"

"థ్యాంక్స్.... ఏమి చేసినా మీ రుణం తీరదు. మీ లాంటి సహృదయం గల డాక్టర్ దొరకటం మా అదృష్టం".... లేచి నిలుచుని రెండు చేతులు జోడించాడు.

"దిస్ ఈజ్ మై ప్రొఫెషన్, మై డ్యూటి - మెంటల్ కేసెస్ ట్రీట్ చేయడమే నా వృత్తి. వాళ్ళని ఓర్పుగా.... లాలనగా చూసినపుడే, త్వరగా కోలుకోగలరు."

"అందరికీ ఆ ఓర్పు వుంటుందా ....?".

"వుంటేనే సక్సస్‌ఫుల్ అవుతారు."

## 30

విశాల దగ్గరకు వెళ్ళి ఒప్పించాలి .... ఆ జోడీ ఎంత అపురూపం? .... వెళ్ళి అడిగితే ఏమంటుందో తను? ఏమంటుంది. ఒప్పేసుకుంటుంది. ఇంత మంచివాడు ఎక్కడ దొరుకుతాడని? దబాయించి,.... ఒప్పించాలి.

రెడ్ లైట్ దగ్గర ఆగింది కారు. మళ్ళీ ఆలోచనలు.... విశాల తండ్రి ఒప్పుకుంటాడా? మధ్య ఆ రాజేష్ ఒకడు! ఏ అడ్డంకులూ లేకుండా ఈ వివాహం జరుగుతుందా....? ఇలా యోచిస్తూ రెడ్ లైట్ ఆరి పోవటం గ్రీన్ లైట్ వెలగటం.... ఆమె గమనించనేలేదు.

"మేడమ్.... మీ ఆలోచలకి స్థలం.... దొరకలేదా....? నడి రోడ్డులో కారాపుకుని తీరిగ్గా ఆలోచిస్తున్నారు. అచ్చం ఇండియా అనిపిస్తున్నారు" అంటున్న అతన్ని నోరావలించి చూడటం తప్ప మారు మాటాడలేక పోయింది చందన.

'షేమ్' అని పించింది. హ్యాండ్ బ్యాగ్‌లో వున్న ఫోటో తీసి చూసింది. అతనే.... న్యూయార్క్‌లో వున్నందు వలన కాబోలు ఇండియా.... అని

చులకనగా అన్నాడు. పెళ్ళి చూపులలో తనని చూచి.... అప్పుడే మంటాడో....

విశాల ఆవేళలో ఇంటిలో వుండదని ఆఫీసు కెళ్ళింది. ఆఫీసులోలేనట్టు బిల్డింగ్ కట్టించే సైటుకి ఇన్‌స్పెక్షన్‌కి వెళ్ళినట్లూ చెప్పారు.

వాళ్ళనడిగి అడ్రసు తీసుకుని సైటుకి వెళ్ళేసరికి పన్నెండయింది.

మూడంతస్తుల బిల్డింగ్ - మూడవ అంతస్తులోనిలుచుని ఎవరితోటో సంప్రదిస్తోంది విశాల.

చందన పైకి చూసింది. సరీగ్గా ఎండ చివ్వున కళ్ళకు కొట్టింది. 'అబ్బ' అని కళ్ళు నలుపుకుని, అక్కడ పని వారితో చెప్పింది విశాలను పిలవమ వాళ్ళు వెళ్ళి చెప్పగా విశాల వచ్చింది.

"ఈ ఇంజనీరమ్మని కలుసుకోవాలంటే ఎన్ని ఇబ్బందులురా తండ్రీ," అంది చేతులు జోడిస్తూ.

'అంత అర్జంటు ఏమిటి.... ఎండలో పడి వచ్చావు?"

"ఏమి చేయాలి? ఈ మహారాణి కోసమే".

"నాకోసమే.... ఎందుకట".

"మాట్లాడాలి.... ఇంట్లో అయితే ఫ్రీగా వుండదు"

"ఏమిటో అంత రాచకార్యం?"







"శమ్మి విధివంచిత కాదు. తన జీవితంలో తానే నిప్పులు పోసుకున్న అహంకారి అంటాను నేను." చందన స్వరంలో అనూహ్యమైన ఆవేశం.

"నిజమే కాని, ఒక్కోసారి విధి బలీయమేమో !"

"శమ్మీకి ఏమైంది.... ?"

"అత్తగారు ఒక గయ్యాళి ; భర్త ఒక తాగుబోతు.... పెళ్ళి యేంతవరకు అతి మంచివాళ్ళుగా మభ్యపెట్టారు."

"శమ్మి ఏమంటుంది.... ?"

"ఏమంటుంది.... నోరు తెరచి సమాధానం చెప్పదు.... ఎప్పుడు వెళ్ళినా.... ఇంట్లో లేదనే చెపుతుంది వాళ్ళత్తగారు.... మరి ఒక్కసారి కలసి మాట్లాడదామన్నా వీలుపడ లేదు" అంది నిట్టూరుస్తూ విశాల.

"ఈ మధ్యనే కదా పెళ్ళయింది .... అంతలోనే ఇలా చేస్తున్నారా...?"

"ఈరోజు ఇంటికి వెళ్లెప్పుడు శమ్మిని కలసి పోవాలనుకుంటు న్నాను"

"దారుణాలు, ఘోరాలూ జరుగు తున్న ఈరోజుల్లో శమ్మి విషయం కాస్త జాగ్రత," అని హెచ్చరించింది చందన.

"ఎండగావుంది వెళ్లదువు గానిలే"

"వెళ్ళి అన్నయ్యతో చెప్పాలి కద !"

విశాల నవ్వింది - చల్లటి వెన్నెల కురిసినట్లుగా.... "అదిగో నీనవ్వుకు ఈఎండే వెన్నెలగా మారిపోయింది తెలుసా.... ? వెళతాను." చందన వెళ్ళి పోయింది.

సెలయేటి గల గలలు.... విరు నవ్వుల జడివాన సవ్వడి సద్దుమణిగి పోయినట్లయింది.

విశాల కుర్చీలో కూర్చుని తల వెనక్కు ఆన్చి విశ్రాంతిగా కళ్ళు మూసుకుంది.

నాగార్జున రూపం.... ఆమె కన్ను లలో మెదిలింది.

ఏ స్త్రీ వరించదు అటువంటి సుగుణ వంతుని, సుందరాకారుని.... ? నా జీవితాన్ని పూలసజ్జలా నీకర్పించు కుంటాను" - అనుకుంది.

అంతలోనే రాజేష్ గుర్తొచ్చాడు. సన్నని కంపన కలిగింది.... ముమ్మా ర్తులా విలనే - ఈ అమృత భాండంలో విషపుచుక్క విదిలించడు కదా! ఈ లోకంలో అల్పత్వం.... కుటిల మన స్తత్వం అధికంగా ఉన్నాయి.

ఆఫీసు నుండి నేరుగా శమ్మి వాళ్ళిం టికి వెళ్ళింది విశాల.

వాకిట్లో నిలబడి బజర్ నొక్కింది - తలుపు తెరచుకుంది.

ఎదురుగా శమ్మి అత్తగారు.... రుద్రకాళి మాదిరి నిలబడింది దారికి అడ్డుగా. ముప్పైరెండు పళ్ళూ బయట పడేలా నవ్వి.... "ఎవరూ ఇంజనీరు విశాలమ్మ! ఏమిటమ్మా ఇలావచ్చా రు ?" వ్యంగ్యధోరణిలో అడిగిందామె.

"ఏముంది, శమ్మీని చూచి పోదా మని వచ్చాను."

"అలాగా.... అయ్యో.... పాపం ఇంత శ్రమపడి వచ్చారు.... శమ్మి.... లేదే...."

"శమ్మి లేదా.... ఎక్కడి కెళ్ళింది .... ?" అనుమానంగా లోపలకు తొంగి చూస్తూ అడిగింది.

"అయ్యో తల్లి... అంతగౌరవమా, తల్లీ, నామీద వాళ్ళకు.... భార్యాభర్తలిద్దరూ.... ఒక్కనిమిషం కూడా ఇంట్లో వుండరనుకో.... నీవైనా చెప్ప కూడదు ? అత్తగార్ని ఆదరణగా చూడమని."

"ఎప్పుడొస్తారు.... ?"

"అయ్యో ! నాకంత విలువ ఇస్తే, ఇకలేనిదే ముంది తల్లీ ?" అంది నుదురు మీద బాదుకుంటూ. అంతలోనే పరుగెత్తు కొచ్చాయి కన్నీళ్ళు ఆమెకు.

విశాలకు విరాకు కలిగింది.... అలా బయటే నిలబెట్టి మాట్లాడి పంపేయటం ఏం మర్యాద ? ఆమె మాటల మీద నమ్మకం లేనట్లుచూచి....

"నేను వచ్చానని చెప్పండి.... ఫోను చేయమని.... చెప్పండి.... శమ్మి వస్తానే," అంది విశాల.

"అలాగే, అలాగే వెళ్ళిరామ్మా." అంది రుద్రమ్మ.

శమ్మి వున్నరూమ్ తెరచి.... "ఏమే శనిరాణి.... మా.... అక్క వచ్చింది.... నిన్ను ఇలాగదిలో పెట్టి లేవని చెప్పానని.... ఎప్పుడైనా ఎక్కడెనా, ఎవరితోనైన.... నోరుజారి

## సినిమా పేరు ?

'చింతకు చిగురే సింగారం - మనిషికి పొగరే బంగారం ' అనేపాట 'పొగరుబోతు' చిత్రంలోనిదని పోటీలో పాల్గొన్న వారిలో 62 శాతం చెప్ప గలిగారు.... బహుమతి పొందినవారు; వై సుందరరావు, రాజా పానగల్ రోడ్, మూడవ నార్త్ క్రాస్ స్ట్రీట్ ఒంగోలు 523 002 ; ఆర్ అచ్యుత రావు, కేరాఫ్ : ఆర్ భగవాన్ సిద్దాంతి, హనుమాన్ నగర్, హనుమాన్ జంక్షన్ - 521 105.... విజేతలలో మొదటి పదహారుగురు : 1 ఒ రమా మోహన్, నెల్లూరు 2 జి సూర్య నారాయణ, అవనిగడ్డ 3 ఎ సన్యాసి రావు, మద్రాసు 4 వి జగదీష్, విశాఖపట్నం 5 కె శ్యామల, కాకినాడ 6 ఆర్ గౌరి, కాకినాడ 7 ఎల్ సత్య నారాయణ, గుంటూరు 8 పి వరద రావు, హైదరాబాదు 9 ఎమ్ వెంక టేశ్వర్లు, అనంతపురం 10 ఎస్ దయాకరరావు, తిరుపతి 11 బి సుబ్రహ్మణ్యం, ఏలూరు 12 వి సూర్యారావు, చిత్తూరు 13 యస్ లక్ష్మినారాయణ, నెల్లూరు 14 కె కామేశ్వరరావు, కడప 15 డి విశ్వనాధం, విజయనగరం 16 ఎల్ పద్మావతి, ఖమ్మం.... పోటీలో పాల్గొన్న అందరికీ అభినందనలు.

చెప్పావా ? నీవు రెండు కాళ్ళతో కాదు నడిచేది.... నాలుగు కాళ్ళతో జాగ్రత....'' హుంకరించింది శమ్మి మీదకు.

చిన్నప్పటి నుండి.... ఎంతో ముద్దు ముచ్చటలతో పెరిగింది. ఇప్పుడు అంతా తల క్రిందు లయింది. కాళ్ళ పారాణి ఆరక ముందే ఈ అత్త గారు ; చచ్చినపాముని బాదుతోంది ; భర్త అయితే సరేసరి - ఒక్కక్షణం .... ఇంటి పట్టున వుండడు. ఫ్రండ్స్‌ని వెంటేసుకుని.... ఎప్పుడూ తాగి.... తందనా లాడుతుంటాడు. ఇచ్చిన లక్షరూపాయలు తల్లీ, కొడుకూ చెరి సగం పంచుకున్నారు. కొడుకు, తాగు డుకి ఏభైవేలు.... యిచ్చింది.... ఆ మహాతల్లి. చేతినిండావుండే అడబ్బుతో తాగివచ్చి.... రోజు శమ్మిని. బావగొట్టే వాడు.... ఒళ్ళు కమిలిపోయేట్టు కొట్టి, "నీవు త్వరగా చస్తేకదా నాకు వివాహ యోగం. ఈడబ్బు అయిపోక ముందే, చచ్చి పుణ్యం కట్టుకో, ఈసారి డబుల్ లక్‌తో పెళ్ళి చేసుకుంటాను. నీదే ఆలస్యం.... నీవు పతివ్రతవైతే తొంద రగా చచ్చిపోవాలి''

శర్మిలకు కన్నీళ్ళుతప్ప ఏమి మిగ లేదు. జీవితం అంధకారబంధురం. తను చిత్తు చిత్తుగా మోసపోయింది. విశాలను నిష్కారణంగా ఎన్నేసి మాటలన్నదో!

సాయంత్రం విశాలను చూచి ప్రమీల అడిగింది - ఏమి జరిగిందని, విశాల చెప్పింది శమ్మి విషయం.

"విశాల - నీవు పొరబడటం లేదు కదా ! మునుపు నే వెళ్ళినపుడు శమ్మిని వాళ్ళత్తగారు ఎంతో బాగచూస్తున్నా రనీ.... శమ్మి అదృష్టవంతురాలనీ అని పించింది. మనందర్నికాదని ఏరికోరి చేసుకున్నా అది సుఖంగా వుంది. అదివాలు. నిజంగానే శమ్మి ఇంటిలో లేదేమోనమ్మా ! కొత్తగా పెళ్ళయిన జంటకదూ ! అలావెళ్ళటం సహజమే .... శమ్మికి నచ్చ చెప్పాలి. పెద్దా విడ్ని కొంచెం జాగర్తగా చూసుకోమని. శమ్మి ఎంత పెంకి పిల్లో మనకు తెలి యనిదా ?''

తల్లి ధోరణి చూస్తే విశాలకు మతి పోయినట్లయింది.

## 31

రాజశేఖరం, భార్య రాజేశ్వరి.... ప్రమీలా సూర్యారావుల ఇంటికి వచ్చి విశాల విషయం అడిగారు. సూర్యారావు మహదానందంతో.... ఒప్పుకున్నాడు. 'మా అమ్మాయి మీ ఇంటి కోడలవటం ఏ పుణ్యఫలమో"

"మొదట్లోనే చెపుతున్నాను.... కట్నకానుకలు మేము పుచ్చుకోము - ఆ మాట ఎవరి నోటంటా రాకూడదు.''

తన చెవులను తనే నమ్మలేనట్లు చూస్తున్నాడు సూర్యారావు.

"ఏమిటి అలా చూస్తున్నారు ?''

"ఏమిలేదు.... ఇంతటి సుజనులు, సుచ్చరితులు, సదాశయులు, మా అమ్మాయిని కోరుతూవుంటే ఆనందం పట్టలేక....''

"అలా అనుకోవద్దు మీ వంటి వాళ్ళమే మేమూను.''

(ఇంకా వుంది

